# కాంతిస్వప్న

పదచిత్ర వచన కావ్యం

డా॥ జి.వి. పూర్ణచందు

ప్రచురణ :

**శ్రీమతి గుత్తికొండ రామరత్నం చారిటబుల్ ట్రస్ట్**

మచిలీపట్నం - 521001

a

**KANTI.SWAPNA**
*Padachitra Vachana Kavyam*

By.. **Dr. G.V. Purnachand**
Susrutha Ayurvedic Hospital
1st Floor, Satnam Towers,
Opp. Buckinghampet HPO
Governorpet, Vijayawada - 520 002
Cell : 9440 172642

*Published on the Occasion of*
*61st Birthday of* ***Dr. G. V. Purnachand***

First Edition : 1988
Second Edition : April 2017

*Title Painting by : Padmasree* Dr. S.V. Rama Rao, (Chicago)

Title Design : Mohan

Published by :
**Guttikonda Ramaratnam Charitable Trust**
24-388, Gruhapriya Foods,
Ramanaidupeta, Machilipatnam - 521 001
Cell : 94401 67697, 94401 72642

Price : Rs. 100/-

Printed at :
Sri Sri Printers
Maszid Street, Arundelpet
Vijayawada - 520 002
Cell : 9490634849




# అనురాగమనం

ప్రియమైన సుబ్బారావూ....

1988లో కాంతిస్వప్నను నీకు అంకితం ఇచ్చినప్పుడు ఏ మాటలు వ్రాశానో అవే మాటలు అచ్చంగా 30 యేళ్ళు గడిచినా ఏమార్చవలసిన అవసరం లేనంత చిక్కగా ఇప్పుడూ ఇంకోసారి వ్రాస్తున్నాను :

ఏ అనురాగం
అనంత గీతమై
పల్లవీ చరణాలుగా
మన సాహితీ సాహచర్యాన్ని
శాశ్వతం చేసిందో...

ఏ గమనం
మరోప్రస్థానమై
దరీదారులుగా
మన సాహితీ సహజీవనాన్ని
సుస్థిరం చేసిందో...

ఏ స్నేహబంధం
లోహబంధమై
గురుశిష్యులుగా
మన సాహితీబాంధవ్యాన్ని
కీర్తిమంతం చేసిందో...

ఏ సహృదయం
దీక్షావ్రతమై
దీక్షావృతమై
కార్యకర్తలుగా
మన సాహితీకలాపాల్ని
మూర్తిమంతం చేసిందో...

నేస్తం
నాలుగు పదుల యేళ్ళు కలసి
యేరులా సాగిన చలనానికి
ఈ అక్షరాలు
అలంకృత ఆకృతులు

అందుకో ఇంకోసారి
ఈ గుప్పెడు కలలు!

**– డా॥ జి. వి. పూర్ణచందు**

# స్వచ్ఛమైన జ్ఞానకావ్యం కాంతిస్వప్న

డా॥ దీర్ఘాసి విజయభాస్కర్

*ముఖ్య కార్యనిర్వహణాధికారి, ఆం.ప్ర.*

*సృజనాత్మక, సంస్కృతి సమితి*

ఇప్పటి వరకు మనిషికి తెలిసిన పరిపూర్ణ అనుభూతి సాధనం మనసొక్కటే! కొన్ని జీవులకు ఈ శక్తి ఉన్నా భిన్నస్థాయిల్లో ఉంది. అందుకే, మనిషికి ప్రకృతిచ్చిన చైతన్యాన్ని ప్రకృతికే అంటగట్టి ఆరాధ్యమైన వన్నింటినీ మానవీకరించుకున్నాడు.

ఆ క్రమంలోనే సూర్యచంద్రులకు, నక్షత్రాలకు దేవతా రూపాలకు పేర్లు వచ్చాయి. లక్షణాలు వచ్చాయి. లక్ష్యాలు ఏర్పడ్డాయి. ఈ స్పృహను, జ్ఞానాన్ని నిర్దయగా చంపేస్తోంది మతం.

సామాజిక చట్రాన్ని, లౌకిక వ్యాపారాలను అధిగమించి అప్పుడప్పుడు కవి మేథస్సు ఆలోచిస్తుంది. స్థల, కాల పరిమితుల్ని అధిగమించి చరిస్తుంది. అలౌకిక దృక్కులతో విశ్వజగత్తులో సంఘటిల్లే విరాట్ ఘటనలను తిలకిస్తుంది.

డా.పూర్ణచందు అలా తిలకించి పులకించి వ్రాసిన కావ్యమే ఈ కాంతిస్వప్న. ఈ ప్రయత్నంలో విశాలవిశ్వపరిధులు దాటి విహరించాడు. సూక్ష్మమైన పరమాణు నిర్మాణంలోకి పరికించి చూశాడు.

"ఎన్ని జగాల యుగాలు అంగలార్చిందో ప్రకృతి
సృష్టి పాదులో ఓహాన్ని నాటాలని!
ఎన్ని రాగాల అనురాగాలు అభిషేకించిందో ప్రకృతి
పరమాణువులు పరస్పరం పరిష్వంగించాలని...
ఎన్ని ఆశల ఆశయాలు
ఊసులిచ్చి పోషించిందో ప్రకృతి

ఆవేశాలు

ఆలోచనాలోచనాలతో మమేకం కావాలని!"

మూఢనమ్మకాల మలినం అంటని స్వచ్ఛమైనజ్ఞానం ఎలా ప్రశ్నిస్తుందో చూడండి...

"జీవకోటి అనంతమౌతుందని
ఏనాడూ తానూహించని యుగాన
ఎక్కడుండేదో ఈ అంతరాత్మ...?
జీవపదార్థమే అవతరించని నాడు
ఏమైపోయిందీ అంతర్యామి...?"

ఈ కావ్యంలోని ఆరు ప్రకరణాల్లో అంతరాత్మ ప్రయాణం అంతర్లోకాలకు వెళ్తుంది. రెండవప్రకరణంలో చూడండి...

"అప్పుడు తెలిసింది అసలు రహస్యం...
జీవమున్నా ఆత్మ
దేహానితో ముడిపడేవరకూ నిశ్చేతన!
జవమున్నా ఆత్మ
లోకానితో సరిపడేవరకూ జడన!"

"రేపటి రేగడి మనసులో
దిగుబడి గుణాన్ని ఎరువేస్తోంది...
లోకం గాదెలు జీవులతో నిండాలని!"

పూర్ణచంద్ గారి గొప్పదనం ఎక్కడుందంటే ఎంతటి గాఢమైన తాత్త్వికజ్ఞానమైనా సాధారణ లౌకిక సంకేతాలతో విశదపరుస్తాడు.

"మన్వంతరాలుగా వెలుగురేడు
ఎక్కి తిరిగిన పడవలా ఆకాశం
బతుకు పందెం గుర్రాల్లా చుక్కలు
బారికేడులను దాటి దూకుతున్నట్టు
వెట్టి గాడిద వీపున

విడిచిన బట్టల మూటలు

వ్రేలాడుతోన్నట్టు"

సృష్టిలోని స్వయం చాలక క్రమశిక్షణా తత్వాన్ని ఎంత అందంగా చెబుతున్నాడో...

"ఏ చలనం పేం బెత్తం పట్టుకుందని

ఏరు వణుకుతూ పారుతోంది...?

ఏ స్పందన చెవి మెలిపెట్టిందని

భూమి బుద్ధిగా తిరుగాడుతోంది...?

ఏ కిరణం పాదాలకు వేగాలు పులుముకుందని

వెలుతురు తిన్నగా దూసుకుపోతోంది...?"

ఈ కావ్యంలోని భావాలు అతీంద్రియ తపోస్థితి నుండి వచ్చినవి. వాటి వ్యక్తీకరణకు సముచిత భాషను ఎంచుకున్నాయి.

"అండపిండ బ్రహ్మాండాలు

గిన్నెలో బ్రహ్మాండంగా ఉడుకుతాయి

మాంస 'కండకావరాలు'

మీ'మాంస' లేకుండా ఉడుగుతాయి"

అహంకారపూరితమైన తాత్కాలిక మానవ అస్థిత్వాన్ని ఎత్తిచూపుతూ నీటిలో ప్రాణి జీవం పోసుకోవటం, గాలి ఊపిరై జీవనానికి ఆధారం కావడం రెండు లైన్లలో అద్భుతంగా చెబుతాడు కవి...

"దుఃఖవారాశి సృష్టికి జీవం పోసింది!

సుఖసమీరం సృష్టికి ఊపిరై నిలిచింది!"

ప్రాణస్పందన పొందిన జీవి పరిణామక్రమంగా మానవునిగా మూర్తీకరించుకుని తన చిరుపాదాలతో అనంతమైన సృష్టిలో సాగిస్తున్న అన్వేషణ క్రమాన్ని ఆవిష్కరిస్తాడు కవి.

అయితే, భావధార కేవలం తాత్త్విక చింతనతో ఆగదు ఈ కావ్యంలో. సమకాలీన సామాజిక సమస్యలపైకి మరలుతుంది!

"ఏ కొండనెక్కి
సూర్యుడు లోకాన్ని పొడుస్తున్నాడో
ఆ కొండపైనే ఆపన్నులు రక్తపతాక నెగరేస్తారు"

కావ్యం చివరలో గొప్ప సమన్వయం సాధిస్తాడు... సత్త్వ రజస్తమో గుణాలు వాటి వాటి పరిధుల్లో విజృంభిస్తే, మానవ విభజన పటాపంచలై సమత్వ సాధన సాధ్యమంటాడు. మానవుడు సృష్టించుకున్న అడ్డుగోడలు, మనోబలంతో బద్దలు కొట్టండంటాడు. "బానిసల్ని బలిచేస్తే లోకంలో తిరుగుబాటు ఆగదు- పాదుషాల్ని ప్రోత్సహిస్తే లోకానికి జరుగుబాటు సాగదు" అంటూ గొప్ప ముక్తాయింపు పలుకుతాడు.

అందుకే నేనంటాను- ఈ కాంతిస్వప్న పదచిత్ర వచన కావ్యం...

"అంతర్ముఖమైన మానవ చేతస్సు చేసిన ధ్యానం
అనంతంగా సాగే అంతరాత్మ అనిర్వచనీయ క్షాళనం
లోకానుభవానికి ఆవల నిలిచిన స్వచ్ఛమైనజ్ఞానం"

అరుదైన అనుభూతిని ఈ తరానికి అందిన్న సుకవి డా|| జి.వి.పూర్ణచందు అన్నకు నా అభివాదాలు.

పూర్ణచందు 'కాంతి స్వప్న'....

# మనిషి బహిరంతర సంగ్రామానికి అక్షరాకృతి !

**- విహారి**

ఇవాళ డా॥ జి.వి. పూర్ణచంద్‌ని సాహితీ లోకానికి కొత్తగా పరిచయం చేయనక్కర్లేదు. భాషా సేవకుడుగా, వైద్యవిజ్ఞాన ప్రసారిగా, కవిగా, వచన రచయితగా, నవలాకారుడుగా, పరిశోధకుడుగా, కార్యనిర్వాహకుడుగా - బహుముఖీనమైన దీక్షాదక్షతల్ని చూపుతూ - తనదైన వ్యక్తిత్వాన్నీ; సాహిత్య వ్యక్తిత్వాన్నీ చాటుకున్న వినయశీలి. అందరికోసం, అక్షరంకోసం అవిశ్రాంత చైతన్యపథగామి - పూర్ణచంద్.

అక్షరాలా శతసంఖ్య దాటిన గ్రంథకర్తగా డా॥ జి.వి. పూర్ణచంద్ - రచయితగా తెలుగు సాహితీ లోకానికి సుపరిచితుడు. పిన్నవయసులోనే 'అమలిన శృంగారం' వంటి అపూర్వ గ్రంథాన్ని రాసి, పెద్దల చేత 'శహబాస్' అనిపించుకున్నవాడు. మినీ కవితోద్యమ సారథిగా తన కార్యదక్షతని చాటుతూ, కవిగా ఎదిగినవాడు. 'కాంతిస్వప్న' దీర్ఘకావ్యంతో ఉత్తమకవిగా గుర్తింపు నందినవాడు.

1975లో అతను కళాశాల విద్యార్థిగా వున్న నాటినుండీ ఎరిగిన వాణ్ణి కావటాన, నన్ను గురు స్థానంలో వుంచి గౌరవించిన వాడు కావటాన ఈ మాటలు వ్రాసే అవకాశం నాకుంది.

ఆనాటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి పాతికేళ్ళ యువకుడుగా 'ఎన్నికైన' సభ్యుడు.

తెలుగువారి ఆహారపు అలవాట్ల మీద సాధికారికంగా 11 పుస్తకాలు వెలువరించినవాడు. తెలుగువారి రుచీ, అభిరుచీ ఎరిగినవాడు 'తెలుగు' భాషోద్యమ ప్రముఖుడు. పరిశీలకుడుగా, పరిశోధకుడుగా తెలుగు భాషలోని వడినీ, నుడినీ, సింగిడినీ - లోకాని కందిస్తూ అబ్బుర పరుస్తున్న ధీశాలి.

35 ఏళ్ళ వయస్సులోనే ప్రపంచ సాహిత్యంలో ఈనాటివరకూ లేని, రాని – చారిత్రక ఐతిహాసిక నవల 'సప్తసింధు'ని రచించిన సాహితీ కృషీవలుడు.

'కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రధాన కార్యదర్శిగా – అటు 'తెలుగు పసిడి', 'తెలుగు మణిదీపాలు', 'కృష్ణాజిల్లాసర్వస్వం', 'వజ్రభారతి', కృష్ణాసర్వస్వంవంటి బృహత్ గ్రంథాల సంపాదకుడిగా, ఇటు జాతీయ అంతర్జాతీయ సదస్సులు, సమ్మేళనాలు, మహాసభల నిర్వాహకుడిగా – తన దీక్షా దక్షతల్ని తెలుగువారి పరం చేసిన తేజోనిథి.

ఇది 'కాంతిస్వప్న' దీర్ఘకవిత. ఎప్పుడో 1982లో దీనికి బీజావాపనం జరిగింది. అప్పుడు పూర్ణచంద్‌కి 26ఏళ్ల ప్రాయం. స్ఫాటికస్వచ్ఛమైన మేధాదర్పణం ఉన్నవాడు. గాఢమైన, గవేషణతో నిండిన అధ్యయన శీలంతో అతను సాహిత్యకారునిగా రూపుదిద్దుకుంటున్న కాలం అది. ఆదర్శాల భారం ఎన్నెన్నో ఉత్తేజ భరితమైన గమ్యాల్ని నిర్దేశిస్తున్న సమయపరిచ్ఛేదంలో ఉన్నాడు. చితి – చింతనతో, సంవేదనలతో మథన పడుతున్న పూర్ణచంద్‌లోని 'కవి' ఏకబిగిన ఈ కావ్యాన్ని రాసేశాడు!

అప్పటి వచన కవుల గురువు కుందుర్తి. యువకవుల్ని అమితంగా ప్రభావితుల్ని చేసిన ఉద్యమశీలి ఆయన. 1981-82 లో బరంపురం వికాసం సభల నుండి తిరిగి వస్తూ రైల్లో పూర్ణచంద్ కుందుర్తికి 'కాంతిస్వప్న' మొత్తాన్ని చదివి ముఖతః వినిపించాడు. ప్రత్యేకమైన అభిప్రాయమేమీ చెప్పకుండా తాను హైదరాబాద్ వెళ్లిపోయారు కుందుర్తి. ఆ వారంలోనే గుత్తికొండ సుబ్బారావుకి – ఒక కార్డు రాశారాయన. 'పూర్ణచంద్ ఐదారేళ్లు ముందుగా తన కావ్యాన్ని రాశాడు. దానిలోని కవిత్వ సాంద్రత, భావజాల పటిమ అలా ఉన్నై కనుక, ఐదారేళ్లు ఆగి, తిరిగి చూసుకుని అప్పుడు ప్రచురించమని చెప్పు' అని ఆ ఉత్తరంలోని సారాంశం. ఆ పోస్ట్ కార్డ్‌ని యథాతథంగా గుత్తికొండ సుబ్బారావు పూర్ణచంద్‌కి పంపించాడు. గురువు గారి సలహాని అక్షరాలా పాటించి, ఆరేళ్ల తర్వాత దాన్ని తీసి, శుద్ధ ప్రతిని కూర్చి 'కాంతిస్వప్న'ని అచ్చువేయించుకున్నాడు పూర్ణచంద్. అలా దాని మొదటి ముద్రణ స్పందన సాహితీ సమాఖ్య ప్రచురణగా 1988లో వెలువడింది. మొదటి ముద్రణ మీద కొంత పెంపుచేసిన రెండవ ముద్రణ ఇది.

కావ్య వస్తువులోని తాత్త్విక బలం వలన ప్రతిపాదిత శిల్పంలోని వినూత్నత - వలన నిజంగానే సాహితీలోకం 'కాంతిస్వప్న'ని సంచలనాత్మకంగా సమాదరించింది. ఆతర్వాత, సమీక్షలు, విమర్శలు, సోమసుందర్ వంటి పెద్దల ప్రత్యేక వ్యాసాలూ, ఈ కృతిపైన ఎం.ఫిల్ పరిశోధన... ఇవన్నీ ఆనందకర సంభవాలు!

'కాంతిస్వప్న'కు సాంఖ్యశాస్త్ర తాత్త్వికత ఆధారభూమిక. అదికేంద్రం. అక్కడినుండి పరివ్యాప్తమైనది భౌతిక, అధిభౌతిక వాస్తవావరణం. అభివ్యక్తిసాంద్రంగా, కవితామయంగా సాగింది పరిచ్ఛేద వలయసమూహం. వాటిలో ఎన్నెన్నో తరంగాల చలనం!

ప్రకృతీ పురుషుల సంయోజనం - విశ్వావిర్భావం - జీవస్థితీ, గతీ, మనోబుద్ధ్యహంకారాల ఆట. భిన్నభిన్నమైన భావభావనలూ, ప్రిదిలీ ప్రిదలని ఉద్వేగ ఉద్విగ్నితలూ, అంతఃకరణ ఆటుపోట్లు. వీటన్నిటి మధ్యగా (దేహి!) 'జీవుని వేదన'! సత్త్వరజస్తమోగుణ ప్రభావాలతో కల్లోల భరితమైన జీవనం. జీవించక తప్పని అనివార్యత. కల్లోలాల సమూహంలో ఏకాకిగా వున్న అంతరాత్మ. దాని అంతర్మథనం. వాంఛనీయత అవాంఛనీయతల విచికిత్స. కడకు - ఆత్మజాలంలో అలతి అలతిగా - 'ఎరుక'! అటుపై సామాజిక సంక్షోభం. చివరికి దిశా నిర్దేశం!

ఇలా - "అమూర్తం" నుండి "మూర్తిమత్వానికి" గమించిన భావశ్రేణిని చదువుతాం - ఈ కాంతి స్వప్న'లో.

'ప్రకృతి' నాందిగా ప్రారంభమవుతుంది కావ్యం. 'ప్రకృతికీ ఒక ఆకృతి ఉంది/ దానికీ ఒక ఊపిరుంది / ఆకృతికి ఊపిరొక్కటే చాలదని/ ఆవేశానికి విచక్షణ తోడుకావాలని/ ఆనందానికి ఆలోచన వేదిక కావాలని/ ప్రకృతి/ ప్రసరించిన కిరణాలే/ పాదాలుగా సాగిపోతోంది' అని వివరణాత్మకంగా నడుస్తుంది. భాగం - ఒకటి. 'జీవపదార్థమే అవతరించని నాడు/ ఏమై పోయింది ఈ అంతరాత్మ/ జీవకోటి అనంతమౌతుందని/ ఏనాడూ తానూహించని యుగాన/ ఎక్కడుండేదో ఈ అంతర్యామి..?' అని ప్రశ్న పరంపర సాగుతుంది. 'సృష్టిపాదుల్లోంచి అప్పుడు / అంకురించింది జ్ఞానజ్యోతి'. అటు తర్వాత 'జీవులు గోళాల గడపలు దాటే అడుగులు ఎలా నేర్చుకున్నాయో' అనే విచికిత్సకి సమాధానాలు వస్తాయి. అంతరాత్మ సాక్షాత్కారం జరిగింది. 'అది మొదలు

అనాదిగా / యంత్రిస్తూనే ఉంది అంతరాత్మ/ అంతశ్చైతన్యంగా!'

రెండవ అధ్యాయంలో ఈ అంతరాత్మ పరిశీలన పరిశోధన, వివేచన, ఋతం సందేశం వస్తాయి. 'అప్పుడు తెరుచుకుంది జ్ఞానకవాటం'

మూడవ అధ్యాయంలో 'మనసు' రంగుల పట్టకం చిత్రణ జరిగింది. కవితామయంగా నాద, రాగ, పద, కిరణ, పరాక్రమాల పార్శ్వాల మెరుపులూ నీడలూ విచ్చుకున్నాయి. 'తప్పదు మనసుకు/ ద్వంద్వత్వం/ వెలుతురూ చీకట్లతో బంధుత్వం' అని ఫలితాంశం.

నాలుగవ భాగంలో - ప్రకృతి, దేహం, మనసు, ఆత్మల పరస్పర సంఘర్షణ, త్రిగుణాల మధ్య వైరుధ్యాలూ చిత్రితమైనాయి. చివరికి, 'నేను' ను పొంది/ 'తాను'ను ప్రభవించింది/ ఆత్మ మనస్సు'!

ఐదవభాగంలో లోకంతీరూ, ఆ తీరులో ఆత్మ ఆందోళనా వ్యక్తీకరింపబడినై. 'మనసు పొందు పొంది/ 'నేను' తత్వం మిత్రత్వమంది/ తాను సాధించిందేమిటి?' అనే సంక్షోభవ్యాపనం ఎదుటనిలిచింది.

ఆరవ అధ్యాయంలో మనిషి బహిరంతర కధనంలో వాంఛితం స్పష్టం చేయబడింది. సామాజిక న్యాయసాధనకు ఆత్మచేతన ఆవశ్యకతను ప్రోదిచేస్తూ భవిష్యదాశకు ఊపిరిలూదాడు కవి. ఆత్మబలాన్ని, ప్రేరణశక్తిగా, చోదకశక్తిగా ప్రవచించాడు.

ఆరు అధ్యాయాలుగా సాగిన 'కాంతిస్వప్న' కావ్యంలో భావావిష్కరణ పొరలుపొరలుగా విచ్చుకుంటుంది. నేపథ్య నైరూప్యతవలన అర్ధనిగూఢత (అబ్‌స్క్యూరిటీ) కొంత అస్పష్టత (యాంబిగ్యుటీ) గోచరిస్తాయి. కవి ఎంచుకున్న వస్తువులోని తాత్వికాంశాల బరువు వలన అలా అనిపించినా, అవి ఇలాంటి కావ్యానికి సహజ అందాలుగానే భాసించాయి. పూర్ణచంద్ కవిత్వశిల్పం నిస్సందేహంగా ప్రయోగశిల్పం. అయితే శైలి సెలయేటి జాలు. దీనివలన వస్తువులోని నిగూఢత, శిల్పంలోని మార్మికత - రసహృదయుడైన పఠితని ఇబ్బంది పెట్టవు. 'A poem communicates before it is understood' అన్నది ఇందుకే కదా! 'కవిత్వం కాలాతీత కాంతిరేఖ' అన్నాడు సోమసుందర్. దాని భావంలోనూ సహృదయాభిసరణంగా కవిత్వాస్వాదన మిళితమై ఉంది. హృదయ సంస్కారం, గుండెతడి - నిఖార్సయిన కవిత్వాన్ని ఆనందింపజేస్తాయి.

పూర్ణచంద్ కవిత్వంలో వెంటాడే వాక్యాలు ఆలోచనీయంగా జాలువారుతాయి. 'లేనిది కావాలనటం ఆశ/ కావాల్సినది లేకపోవటం అమావాశ్య' అనగానే చూపు ఆగుతుంది, సాధారణ సూక్తిని కవితామయం చేయాలంటే వాక్యాన్ని వ్యంగ్యవిలసితం చేయాల్సిందే కదా! ఇదీ రస విద్య! ఇలాంటివి అనేక ఉదాహరణలు లభిస్తాయీ కావ్యంలో.

ఈ కవిత్వంలో అలంకారికత అలవోకగా ననలెత్తి, పుష్పించి ఫలించింది. కోకొల్లలుగా రూపకాలు మనముందు కొస్తాయి. 'పువ్వుల నవ్వులు, వెలుగుకలలు, భ్రమలగనులు, భయాలతెరలు, దేహంకలనేత చీర' వంటి పదచిత్రాలు అహ్లాదపరుస్తాయి.

'కాంతిస్వప్న' Rotten మూసవస్తువుల్ని ఆశ్రయించిన దీర్ఘకవిత సరుకుకాదు. అది జీవన తాత్త్విక దీపశిఖ. మనిషి – సంవేదనాత్మక అంతర్వేదన నుండి నవ సమాజ ధర్మాశ్రయ ఫలశ్రుతికి నడిచిన – ఒక ప్రస్థాన ప్రక్రియకు సాహిత్యరూపం. 'అందరాని అంటరాని/ బ్రహ్మ పదార్థం కాదు/ ఆత్మతేజస్సు' అనే తెలివిడిని వెల్లడి చేసిన మహావాక్యదీపిక – ఈ 'కాంతి స్వప్న'. అంతేకాదు, 'మనుషులంతా/ ఎగరేసిన జెండాలై', నినదించాలనే సందేశ ప్రసారిణి ఈ 'కాంతిస్వప్న'!

'కాంతిస్వప్న'లో ఉన్న మరికొన్ని అత్యంత విలువైన అంశాలు – బీద్ధి కావారణంలోని Concepts గమనంలో నుండీ జనించిన ఈనాటి సామాజిక సంక్షోభం, రాజకీయకశ్మలం, 'దేహి' తనను తాను కోల్పోతున్న పరాయీకరణవైనం, వీటన్నింటినీ జయించుకురాగల చైతన్య దిశానిర్దేశం! సమాజంతో నిరంతరం సంఘర్షించే, సంభాషించే – మనిషి ఆవిర్భావంనుండి పురోగమనం వరకూ సాగే – ఒక అస్తిత్వ ఆరాట చక్రాన్ని మనముందు నిలుపుతోంది 'కాంతిస్వప్న' !

Out sider గా నిలబడి inside ని చూడగలిగాడు పూర్ణచంద్. ఇది ప్రపంచంలోని ఉత్తమ మేథావుల సాహితీకారుల గుణవిశేషం. Voice is Worthier than speech అంటే ఏమిటో స్తిమితమైన భాషాభావాలతో ఆవిష్కరించగలిగాడు. ఉత్తమకవిగా అతని ఘనవిజయం ఇది!

అభినందనలతో, శుభాకాంక్షలతో, మిమ్మల్ని కావ్యపఠనంలోకి స్వాగతిస్తున్నాను.

# కవితా కలాపం

- డా॥ సంజీవదేవ్

మనిషి

కవి

ప్రతి మనిషీ కవి కాదు

ప్రతి కవీ మనిషే.

మనిషి మాత్రమే కవితను రచిస్తాడు. మిగతా జీవులేవీ కవితను రచించవు.

మిగతా జీవులు పాడగలవు, ఆడగలవు, రూపసృష్టీ చేయగలవు. ఇంకేమోమో చేయగలవు. కాని కవితా రచన చేయలేవు.

మనిషి మాత్రమే కవి

అందరు మనుషులూ కాదు

కొందరు మాత్రమే

డా॥ పూర్ణచంద్ కవి అయిన మనిషి. కనుకనే రచించాడు ఈ "కాంతి స్వప్న" అనే కావ్య ఖండికను.

దీనిలోని కవితలన్నీ మిగతా కవుల ఎవరి కవితలతో పోలిక లేని విలక్షణ నిర్మాణాలు.

నేడు వాడుకలోని ఏ కవితారీతికి దగ్గర కాని ఒక విలక్షణ రీతికి చెందిన కవితలివి - వస్తువులోను రూపంలోను కూడా.

వైదిక కవిత, పౌరాణిక కవిత, ప్రబంధ కవిత, భావకవిత, అభ్యుదయ కవిత, విప్లవ కవిత, అనుభూతి కవిత మొదలైన వాటికి దేనికీ చెందవు డా॥ పూర్ణచంద్ కవితలు.

వీటి మీద ఇతర్ల కవితల నీడలు లేవు; ఉన్నవి ఆయన సొంత నీడలే.

ఇవి అటు ఆత్మాశ్రయ (Subjective) కవితలూ కావు. ఇటు వస్త్వాశ్రయ (Objective) కవితలూ కావు.

అందుకని ఆ రెంటికీ దూరం కావు ఇవి, ఆ రెంటి సమ్మేళనపు అనుమేళనే ఇది.

దీన్ని ఏ కవిత్వం అనాలో? ఏ కవిత్వం అని నిర్ణయించనవసరం లేదు. నిర్ణయించి చట్రంలో బిగిస్తే అది ఏ కవిత్వమూ కాకుండా పోతుంది.

వ్యవహార సౌకర్యం నిమిత్తం ఈ కవిత్వాన్ని ఒక పేరుతో పిలవాలనుకొంటే లోకోత్తర కవిత (Transcendental Poetry) అనవచ్చు.

ఇందులోని భావాలు ప్రత్యేకమైనవి, పదాలు ప్రత్యేకమైనవి, ఉపమలు, రూపకాలు ప్రత్యేకమైనవి.

సాంప్రదాయిక కవితారచనలోని పదాలు ప్రత్యేక కావ్య భాషకు చెంది ఉండేవి.

ఆధునిక కవితలోని పదాలు సామాన్య పదాలు. సామాన్య పదాలతో అసామాన్య భావాలను అభివ్యక్త పరచటం నేటి కవితా రీతి.

ఈ పుస్తకంలోని భావాలు కొంత అసామాన్యమైనవి కొన్ని అసామాన్య పదాలు వీటిని అభివ్యక్తపరచటంలో అసమర్ధమవుతాయి. అయినా, కవి వీటిని సమర్థం చేశాడు.

కవిత కాని రచనల్లో పదానికంటే అర్థానికి ప్రాధాన్యం.

కవిత అయిన రచనల్లో అర్థానికంటే పదానికి ఎక్కువ ప్రాధాన్యం.

కనుకనే మిగతా రచనల్ని ఒక భాష నుంచి మరో భాషలోకి అనువాదం చేయటం సులభం. కానీ కవితను అనువాదం చేయటం సులభం కాదు.

భాషలో లిపి పుట్టకముందే కవిత పుట్టింది. కనుక అప్పుడు కవితను వ్రాయటం అనీ చదవటం అనీ ఉండేది కాదు.

ఉండేది కేవలం కవితను చెప్పటం, కవితను వినటం మాత్రమే.

అప్పుడు కవిత అనేది సంగీతం వలె కేవలం శ్రవ్య కళ.

లిపి ఆవిర్భవించిన తరువాత కవితను వ్రాయటం, వ్రాసిన కవితను చదవటం ప్రారంభమైనాయి.

కవి రచయిత అయినాడు. సహృదయుడు పాఠకుడైనాడు.

నాటి కవిత కథితం. తరువాతి కవిత లిఖితం. నేటికీ ఆశుకవితంతా కథితమే.

సరే, ఏది ఏమైనా, ఒక అవ్యక్తభావానికి భాష ద్వారా సుందర అభివ్యక్తినిచ్చేది కవిత.

మామూలు అభివ్యక్తి కాదు, అది సుందర అభివ్యక్తి కావాలి. ఆ సుందర అభివ్యక్తి కూడ సంక్షిప్త రూపంలో ఉండాలి.

అదీ కవిత.

కవితంటే ఏమిటో వివరించే నిర్వచనాలు ఎన్నో ఉన్నాయి. అయినా, ఏ ఒక్క నిర్వచనమూ కవితను వివరించటంలో న్యాయం చూకూర్చలేదు.

కవిత అంటే ఏమిటి?

కవిత అంటే కవితే

కవిత అయింది మాత్రమే కవిత.

కవిత కాంది కవిత కాదు.

ఇదే కవితకు నిజ నిర్వచనం.

ఈ 'కాంతి స్వప్న'లో చెప్పబడిన విషయాలు, చెప్పిన తీరూ కూడ చాలా సూక్ష్మమైనవి.

సూక్ష్మ విషయాలు కొందరికి మాత్రమే అవగతమవుతాయి. కాని అందరికీ కావు.

కవులు కొందరే ఉంటారు కాని అందరూ ఉండనట్లే కొన్ని విధాల కవితల్ని అర్థం చేసుకొనే వారు కూడ కొందరే ఉంటారు.

కొన్ని విషయాలకు చెందిన కవితలు అందరి నిమిత్తం వ్రాయబడితే మరికొన్ని విషయాలకు చెందిన కవితలు కొందరి నిమిత్తమే వ్రాయబడతాయి.

ఈ పుస్తకం కొందరి నిమిత్తం వ్రాయబడిందే.

కవితా కళ ఎంతో వైవిధ్యం కలది. జటిల విషయాలకు చెంది ఉంటుంది, సరళ విషయాలను చెంది ఉంటుంది, ఆ రెంటికీ మధ్యకు చెంది ఉంటుంది.

కవితంటే ఇట్లాగే ఉండాలి, అట్లాగే ఉండాలి అని హద్దు లేర్పర్చటం ఆరోగ్యరీతి కాదు.

డా॥ పూర్ణచంద్ కవితలు కొంచెం మర్మవాదపు నీడలను కలిగి ఉంటాయి. అంటే Mysticism కు సమీపంలో ఉంటాయి.

అంటే కొంత అస్పష్టత ఉంటుంది. పొగమంచులో గుండా దూరపు చెట్లు కనబడుతున్నట్లు, సగం పారదర్శక అవగుంఠనం గుండా ముఖం కనబడుతున్నట్లు.

శాస్త్ర విషయాల్లో స్పష్టత అవసరమైనట్లు కళా విషయాల్లో కొంత అస్పష్టత అవసరం.

అటువంటి అస్పష్ట శోభను అందించటంలో మర్మవాదం తోడ్పడుతుంది.

"గుండె కోనలో
పిక్కటిల్లిన ప్రతిధ్వని
తన ఘోషేనని
మంచు కరిగిన నీటిలో
పరిహసించిన ప్రతిబింబం
తన అట్టహాసమేనని
తాను
తానే ననే
'స్పృహ'
జీవికి కలగాలని !
తనను తననుగా
నిలిపేది
తనను తీగగా
శ్రుతించేది
తనను గీతగా
ప్రార్థించేది
తన అస్తిత్వంలో

తన వునకిని

విస్తృతించేది."

పై కవిత చూపుతుంది వ్యక్తిలోని ప్రత్యేకతను. వ్యక్తి తన్ను తాను సవ్యంగా తెలుసుకున్నప్పుడు కాని ప్రపంచాన్ని తెలుసుకోడు.

ప్రపంచాన్నంతా తెలుసుకొని తన్ను తాను తెలుసుకోకపోతే తాను తెలుసుకున్న ప్రపంచం అంతా తెలుసుకోబడనట్లే!

అంతర్జగత్తులోను, బాహ్యజగత్తులోను కూడ తన ప్రతిబింబాన్ని తాను చూచుకొగలిగినప్పుడు తనలోని స్వార్థం నశించి తాను అంటే తాను మాత్రమే కాదనీ, తాను అంటే అంతా అనీ, అందరూ అనీ అనుభూతిస్తాడు మనిషి.

ఇంకా ఈ విషయాన్నే కవిత్వమయంగా వివరిస్తాడు కవి.

" ప్రవహించే నదికి

పరిగెత్తే చలనం....'నేను' -

సంచలనం నేను!

వికసించే పువ్వుకు

పరిమళించే గంధం...'నేను' -

అందం 'నేను' -"

తనలోని అహం అనంత జగత్తు అంచుల్ని దాటి, క్షితిజ రేఖల కాంతుల్ని అధిగమించి విశ్వాంతరాళ ఆసీమ విస్త ృతిలో వర్తిస్తుంది అదంతా తానై.

స్వార్థపు చీకటి భస్మీపటలమై బూడిద కూడా కాలిపోతుంది.

వ్యక్తి అవ్యక్తమై విశ్వచైతన్యంగా అభివ్యక్తమవుతాడు.

ఆలోచనలు, అనుభూతులు, అభిలాషలు, ఇష్టాలు, అయిష్టాలు, ప్రేమ, ద్వేషం వినిపించవు చెవికి, కనిపించవు కంటికి.

అవన్నీ మానసక్రియలు.

మాటల ద్వారా సాహిత్యంలో అవి వినిపిస్తాయి, రూపాల ద్వారా దృశ్యకళల్లో అవి కనిపిస్తాయి.

అందరి మాటల్లో అవి ఒకే రకంగా వినిపించవు; అందరి రూపసృష్టిలో అవి ఒకే రకంగా కనిపించవు.

ఎవరి దృక్పథాన్ననుసరించి వారివారివి విభిన్నంగా వుంటాయి.

ఈ విభిన్నత స్రష్టల్లో ఉన్నట్లే సహృదయుల్లో కూడ ఉంటుంది; ఒకే కవిత విభిన్న పాఠకులకు విభిన్నరీతుల్లో ప్రత్యక్షమవుతుంది ఒకే ఆకృతి విభిన్న ప్రేక్షకులకు విభిన్న రూపాల్లో దర్శనమిస్తుంది.

ప్రకృతి అనేది మనిషికి బయటా ఉన్నది, మనిషికి లోపలా ఉన్నది. బయటిది విశ్వ ప్రకృతి, లోపలిది మానవ ప్రకృతి.

విశ్వ ప్రకృతిలో ఎంత వైచిత్రి ఉన్నదో మానవ ప్రకృతిలో కూడ అంత ఉన్నది. ఈ రెంటికీ సారూప్యం ఉండబట్టే విశ్వ ప్రకృతిని చూచి మనిషి పరవశిస్తాడు.

దృశ్య ప్రకృతిని చూచి కవి ప్రకృతి స్పందించి, ప్రతిస్పందించి కవితగా రూపకల్పన చెందుతుంది.

"ప్రకృతి -
పులకరించిన ప్రమానాలే
అడుగులుగా సాగిపోతోంది -
కొండలు ఎంచుకున్న
ఎత్తుల మీంచి
లోయలు దించుకున్న
లోతుల్లోంచి
కాలనాదాన్ని ఆలపిస్తూ
సనవశించిన వేళల్ని మేళవిస్తూ,
ప్రకృతి -
రేయింబవళ్ళ శ్రుతిలయలే
గానంగా సాగిపోతోంది -
గ్రహాంతరంగంలో
శిలాతలాల మీద ...
చీకటిలో వెల్తురు చిమ్మే

నక్షత్ర శకలాల వెంట ...

నవజీవనాన్ని సృజించాలని."

సహజంగా కవిత అనేది శ్రవ్యం. కాని డా॥ పూర్ణచంద్ కవితలు దృశ్య మాధురిని సృష్టిస్తాయి. శబ్దాలు వినిపిచే బదులు రూపాలు కనిపిస్తాయి.

కనుకనే ఈ కాంతి స్వప్నాలను ఆయన 'పద చిత్రాలు' అన్నాడు.

కొందరి కవితల్లో రూపం ప్రత్యక్షమైనట్లే కొందరి చిత్రాల్లో కవితలు వినిపిస్తాయి.

అటువంటి చిత్రాలనే "రంగుల్లో కవితలు" అంటారు. రూపాలు గోచరించే కవితల్ని "మాటల్లో చిత్రా" లుంటారు.

డా॥పూర్ణచంద్ రంగుల్లో ఎంతవరకు కవితల్ని నిర్మించగలడో తెలియదు కానీ, "మాటల్లో చిత్రాలు" నిర్మిస్తాడని ఇందులోని ఆయన కవితలు సాక్ష్యమిస్తున్నాయి!

తెలుగులో ఈ పుస్తకం లోని కవిత్వం లాంటిది అసలు లేదని తెగించి చెప్పే సాహసం చేయలేను కాని చాలా అరుదుగా మాత్రమే ఉంటుంది అనగలను.

ఇది సంశ్లేషనాత్మక కవిత కంటే విశ్లేషనాత్మక కవిత.

ఇందులో హృదయం కంటే మేథ ఎక్కువ క్రియాశీలం – "ఆలోచనామృతం".

ఈ కవి కల్పించే పదాల కూర్పు చెవికి ఇంపుగా ఉంటుంది, మనసుకు సొంపుగా ఉన్నట్లే:

"పొగబారిన
వేకువలో
కొండ రాళ్ళూ కన్పించవు
గుండె పగుళ్ళూ విన్పించవు
చీకటి కమ్మిన
సుడిగుండంలో
చేతి సైగలూ కన్పించవు
ఆర్తనాదాలూ విన్పించవు

వెల్తురు మండిన
నిశ్చలన చిత్రంలో
రూపురేఖలూ కన్పించవు
తూర్పు కేకలూ విన్పించవు."

భావానికి భంగం కలగకుండా ఇంపైన మాటల కూర్పును రూపొందించటం సుకరం కాదు, వినటానిక సుఖదం అయినప్పటికీ.

కానీ, ఈ కవి భావశిల్పీ శబ్దశిల్పీ కావటంతో అటువంటి సుకరం కాని పనినే సుఖదంగా నెరవేర్చారు.

కవి తాను రచించే తరుణాన పాఠకులకు ఏది నచ్చుతుందో ఏది నచ్చదో అనే ఆలోచనతో పడితే కవిత్వం కరిగిపోయి పైత్యం మాత్రమే మిగులుతుంది.

పాఠకుల్ని దృష్టిలో పెట్టుకొని కవితకాని వాటిని రచిస్తే ప్రమాదం లేదు కాని, కవితల్ని రచిస్తే మాత్రం ప్రమాదం తప్పదు.

తనకు తట్టిన తీరున రచిస్తేనే కవిత కవిత అయేది, లేనిచో వ్యాసం అవుతుంది భోగట్టాను తెలిపే తీరుగా.

కవి దృష్టి నుంచి సృష్టి అయేదే కవిత.

ఒక ప్రౌఢకవిని మీరు కవితలు ఎందుకు వ్రాస్తున్నారని అడిగితే ఆయన చిరునవ్వి అన్నాడు "మరో పని చేతకాక" అని.

అందుకు నేనన్నాను "మరోపని ఎందుకు చేతకాదంటే కవిత్వం చేతయింది కనుక"

ఆయన దృష్టిలో మిగతా పనులకంటే కవితా రచన తేలికైందని కాదు. బరువైందనే. బరువుపని చేయటం చేతయితే ఇక తేలిక పనుల జోలికి పోవటం ఎందుకని ఆయన అభిప్రాయం.

అవును, కవితను రచించటం బరువుపనే, సందేహం లేదు.

కాని కొన్ని బరువుపనుల్ని చేయటం కొన్ని తేలిక పనులు చేయటం కంటే ఎక్కువ ఆనందంగా వుంటుంది.

అందుకనే బరువుపనైనా కవితారచన చేసేవారి సంఖ్య క్రమేణ పెరుగుతూంది కాని తరగటం లేదు.

'కాంతిస్వప్న' లోని కవితల్లో ఒక నిర్దిష్ట వస్తువు కాని, ఒక నిర్ణీత గమ్యం కాని లేకపోవటం వల్ల అటువంటి అస్పష్టకవితల్ని రచించటం ఎక్కువ కష్టం.

వాటిని చదవటం పాఠకులకు కూడా అంతే.

ఆధునిక కవితలోనే కాక మిగతా కళల్లో కూడ వస్తు ప్రాధాన్యం సన్నగిలిపోయింది.

ప్రత్యేకించి నేటి నైరూప్య చిత్రకళలో అసలు వస్తువేదీ లేకుండా పోయి ఏ వస్తువుకూ చెందని రూపం మాత్రమే మిగిలింది.

ఇరవై ఒకటో శతాబ్దపు కవితలో పూర్తిగా వస్తువు లేని రచన సాగుతుంది. డా॥ పూర్ణచంద్ రచించిన ఈ కవితలు వాటికి నాందియే!

అయితే, ఇటువంటి కవితా గ్రంథాలు నూరు పేజీలకు లోపు ఉంటేనే బాగుంటుంది.

అంతకంటే ఎక్కువైతే పాఠకుల్లో కొంత విసుగు జనించే ప్రమాదం ఉంది. ఇంగ్లీషులో మొనాటనీ అంటారే అటువంటిది ప్రవేశించే ప్రమాదం ఉంది.

ఈ పుస్తకం పేజీలు కూడ ఇంకా ఎక్కువ పెరగకుండా సరిపోనుగా ఉండి ఉండటం సంతోషదాయకం.

ఈ పుస్తకంలోని ఎన్నెన్నో చరణాలు ఎత్తిచూపాలిసినవి ఉన్నాయి. కాని ఆ పని కుదరదు:

"నదీ నదాలను
తనలో కలుపుకుని
ఉదగ్ర ఉదకాలకు
చేతనత్వం నింపుకుని
సముద్రాలను
చాపలా చుట్టగలవాడు,
మహావృక్షాలను

సమాధులపై నిలపగలవాడూ
వొంటికి అంటిన
సంకెళ్ళను
మింటికి ఎగరేస్తాడు"

డా॥ పూర్ణచంద్‌కు మరొకపని చేతకాక కవితారచన చేయలేదు. కవితారచన చేయటానికంటే ఎక్కువగా చేతయిన పని ఆయనకు వైద్యవృత్తి.

వైద్యవృత్తి చేస్తూనే కవితాప్రవృత్తిని చేపట్టేడు ఆయన. ఆ వృత్తి ద్వారా మనుషుల శరీరాలకు సేవ, ఈ ప్రవృత్తి ద్వారా మనుషుల మనసులకు సేవ.

కవుల సంఖ్య పెరుగుతున్న మాట నిజమే. పెరగాలి ఇంకా పెరగాలి. కాని, ఆ పెరిగే దానితోపాటు కవితలోని స్థాయి పెరగాలి.

మానవజీవితం తమ స్వీయ శ్రేయస్సుకూ, లోక శ్రేయస్సుకూ అయి వున్నట్లే కవిత కూడా కవి శ్రేయస్సుకూ, లోక శ్రేయస్సుకూ అంకితమై వుండాలి.

శ్రేయమే ప్రేయం
ప్రేయమే శ్రేయం.

*(కాంతిస్వప్న తొలిముద్రణ 1988కి*
*శ్రీ సంజీవదేవ్ వ్రాసిన ముందుమాట)*

## ఒకటి

వెలుగు కలలతో అల్లిన
రంగుల సంచీలో
దృశ్యాలెన్నో నింపుకుని
ప్రకృతి...
దిక్కులెన్నో లెక్కిస్తూ....
వెదకులాడే వేదాంతిలా
సాగిపోతోంది ...

పువ్వుల నవ్వుల జీవితాన్ని
విచ్చుకున్నప్పటినుంచీ
రాలిపోయేంత కాలాన్ని
సంచీలో పొదుగుకుని
ప్రకృతి...
పులకరించిన ప్రసూనాలే
అడుగులుగా సాగిపోతోంది-

కొండలు ఎంచుకున్న ఎత్తుల మీంచి
లోయలు దించుకున్న లోతుల్లోంచి
కాలనాదాన్ని ఆలపిస్తూ,
పరవశించిన వేళల్ని మేళవిస్తూ,
ప్రకృతి ...
రేయింబవళ్ళ శ్రుతి లయలే
రాగంగా సాగిపోతోంది...

ప్రకృతికీ ఒక ఆకృతి ఉంది...
దానికీ ఒక ఊపిరుంది...
ఆకృతికి ఊపిరొక్కటే చాలదని
ఆవేశానికి విచక్షణ తోడు కావాలని
ఆనందానికి ఆలోచన వేదిక కావాలని...
ప్రకృతి...
ప్రసరించిన కిరణాలే
పాదాలుగా సాగిపోతోంది...
మనోరథంపై ఊరేగుతో,
జగమంత కళ్ళతో వెదకులాడుతో...
వెదకులాటే కదా వ్యక్తిత్వం !!

మబ్బులూ, మెరుపులూ ధారపోస్తూ
ఎండా వానలు 'వీధివార' పోస్తూ
వెలుగు నీడల దీపకాంతులను
అలికి ముగ్గులేస్తూ
సామగానమై మెరిసిపోతోంది...ప్రకృతి!
దీపరాగమై మురిసిపోతోంది...ప్రకృతి!!

గ్రహాంతరంగంలో శిలాతలాలమీద
చీకటిలో వెలుతురు చిమ్మే
నక్షత్ర శకలాల వెంట...
నవజీవాన్ని సృజించాలని!
బీటలు వారిన హృదయ స్పందనల వెంట
నవజీవాన్ని నిలపాలని...!
నవజీవనాన్ని ఇవ్వాలని...!!

నిజం ఒక్కటే!
నీకైనా నాకైనా ఎవరికైనా ...
కొందరిది మౌనం...
కొందరిది కేక...
కొందరు వినిపించుకోరు,
కొందరు కల్పించుకోరు...
కొందరికి వినబడదు
ఇంకొందరికి కనిపించదు!

ఇవి కలలు కావు, ఖరీదులు...!
ఇవి కథలు కావు, నసీబులు...!
ఇవి విషాదాలు కావు, ఆశలు...!
ఇవి సందేహాలు కావు, సమాధానాలు...!
రేపటి మీద ఆశలు,
రేపటి కోసం ఆశయాలు,
రేపటి వలన ఆచరణలు...!

భ్రమల పొరలు వలిచేస్తే
విమల కమలాపందుదే వెలుగు!
భయాల తెరలు తెంచేస్తే
కిలుము లేని పసిడిదే మెరుగు!
ఆలోచన కాదిది ఆశ...
ఆవేశం కాదిది ఆశ...

లేనిది కావాలనటం ఆశ
కావాల్సినది లేకపోవటం అమావాశ!

ఆశంసలూ, ఆకాంక్షలూ
ఆమోదాలు, ఆచరణలూ...

ఆశల సంచీ నిండా సంచితాలే!
సంచితాలన్నీ సంకుచితాలే!

చూపులు -
మౌనం శూన్యంలో కూరుకున్నా....
కలలు -
మాటల కొండమీంచి దొర్లుతున్నా....
ఊహలు -
వాన వెలిసిన బురదలో జారుతున్నా....
మనసు -
ప్రశ్నల పొయ్యి మీద మరుగుతున్నా....
'రేపు'ను నిలబెట్టుకోవటమే
ఆశ! ఆశ! ఆశ!
ఆశలేని జీవి... మనిషే లేని దీవి !

పొగబారిన వేకువలో
కొండరాళ్ళు కనిపించవు...
గుండె పగుళ్ళు విన్పించవు...
చీకటి కమ్మిన సుడి గుండంలో
చేతి సైగలు కానరావు
ఆర్తనాదాలు వినరావు
వెల్తురు మండిన నిశ్చలన చిత్రంలో
రూపురేఖలు చూపులోకి రావు
తూర్పు కేకలు చెవిలోకి చేరవు...

నేల-
తన చుట్టూ పరిభ్రమిస్తోందని
సూర్యుడికి తెలుసా?

సూర్యుడు–
తన వెంటే తిప్పుకుంటున్నాడని
నేలకు తెలుసా?

తన చుట్టూ తాను తిరుగుతున్నా
తిరిగేది తనకళ్ళే!
తూలేది తన ఒళ్ళే!

కళ్ళు మూసుకుని మనసు తెరుచుకు
అంతర్నాటక రంగాన్ని
అంతర్నేత్రంతో అవలోకిస్తే
ఎవరికైనా కనిపిస్తుంది–
చెరిగి పోతోన్న నిఖిల జనస్వామ్యం...!
కరిగి పోతోన్న సకల రక్తమాంసం...!!

అంతరంగంలోకి అంతర్ముఖీనంగా
నడిచి పోతోంది ప్రకృతి,
పిచ్చుకగూడులా అల్లుకున్న
ఆలోచనాజాలాల ఇరుకుల్లోంచి
కశ్మల భావాల శూన్యంలోకి...!

ఎన్ని జగాల యుగాలు అంగలార్చిందో ప్రకృతి,
సృష్టిపాదులో జీవాన్ని నాటాలని!
ఎన్ని రాగాల అనురాగాలు అభిషేకించిందో ప్రకృతి
పరమాణువులు పరస్పరం పరిష్వంగించాలని!!
ఎన్ని ఆశల ఆశయాలు
ఊసులిచ్చి పోషించిందో ప్రకృతి
ఆవేశాలు
ఆలోచనాలోచనాలతో మమేకం కావాలని!

తాను పోసిన నారుకు
తానే నీరు పోయాలని...
తాను చెక్కిన శిల్పానికి
తానే ఊపిరి ఊదాలని...
తాను పలికిన స్వరానికి
తానే అడుగులు కూర్చాలని...
ఎంత బాగా ముస్తాబు చేసిందో
లోకం పాపాయికి...!
ఎన్ని బంగారు ఊహలు రేపిందో
ఈ జీవదీపానికి...!
ఎన్ని నయగారాలు నేర్పిందో
ఈ పుత్తడి బొమ్మకు...!

శోకాలను గుండె నదుల్లో దింపి
లోకాలను గుండె గదుల్లో నింపి
తాను మెట్టిన క్షేత్రాన్ని
తాను మెచ్చిన గాత్రాన్ని
తాను విచ్చిన నేత్రాన్ని
నిండు మదిలో నిలుపుకుని,
తానే అనంత మూర్తిగా
తానే అనంత జలరాశిగా
ఎన్ని వరాల ఫలాలిచ్చిందో
ఈ నిరంతర తాపసికి-
ఎన్ని యోగాల ప్రయోగాలు ప్రసాదించిందో
ఈ నిత్య సాధకుడికి-

బతుకంటే ఏడుపంటాం గానీ,
సుఖమంటే కలలంటాం గానీ,

మావిపొరల మధ్య
ఉమ్మనీటిలో జీవుడికి
ఇన్నిన్ని ఆశలేవీ...?
హోరెత్తే ప్రశ్నలేవీ...?
నోరెత్తే వీలేదీ...?

జీవకోటి అనంతమౌతుందని
ఏనాడూ తానూహించని యుగాన
ఎక్కడుండేదో ఈ అంతరాత్మ...?
జీవపదార్థమే అవతరించని నాడు
ఏమైపోయింది ఈ అంతర్యామి...?
రోదసికి మనిషి ఊరేగి వస్తాడని
తనలోపలి తన ఉనికినే వెక్కిరిస్తాడని
కలనైన కనని మెలకువలో
ఏ రూపాన ఉండేదో ఈ అంతర్జాలం...?

కనిపించే చుక్కలన్నీ మెరిసే జీవులనుకుని,
మురిపించే చందమామ
జీవులు వండుకున్న 'కల' వంటకం అనుకుని
పరుగులెత్తే కాలం గుర్రాలమీద
ఎన్ని మన్వంతరాలు శ్వాశించిందో దీర్ఘంగా...
ఎన్ని భావాభావానుభావాలు ఆక్రోశించిందో మౌనంగా!
ఏం చేయాలో ఎరుకైతే...
రాతిబొమ్మ కూడా కనురెప్పలు కదిలిస్తుంది!
ఏది చేయరాదో ఎరుకైతే...
పూలమొక్క కూడా కాయకాచి ఫలిస్తుంది!

ఏది చేసినా సత్యమైతే...
ఎండునది కూడా నీటి ఉరక లేస్తుంది...

ఏ భూతకాలం
భుగభుగమండే భూమాతని
చల్లార్చిందో...?
ఏ భవిష్యత్తు
బిగుసుకున్న గాలితిత్తిని
కదల్చిందో...?
ఏ వర్తమానం
శోకమాన లోకం కన్నీటి పాత్రని
వంచి వార్చిందో...?
ఎలా విధించుకున్నాయో
సూక్ష్మకణంలో జీవితాలు...?
ఎలా మధించుకున్నాయో
జీవితంలో సూక్ష్మతత్వాలు...?
అక్షయ రోదసి అమ్మ ఒడిగా
కేరింతలాడే జీవులు
ఎలానేర్చుకున్నాయో
గోళాల గడపలు దాటే అడుగులు...?

సృష్టి పొదుల్లోంచి అప్పుడు
అంకురించింది జ్ఞానజ్యోతి

కనిపించిన కాంతుల్ని
ఆహార్యంగా మలచుకుని,
కని, పెంచిన కలల్ని
ఆకృతులుగా నిలుపుకుని,

తాను చేసుకున్న పత్రహరితాన్ని
లోకమంతా పంచాలని,
తాపత్రయించే మొక్కలా
జ్ఞానంగా మౌనబోధ చేస్తూ.....

సాక్షాత్కరించింది అరుణజ్యోతి
దీక్షగా చూసింది అంతరాత్మ-

అణువు లోపలి పరమాణువుల
గాఢ పరిష్వంగాల ఫలితంగా ఏర్పడిన
ఈ అనంత ధరిత్రి పైన,
వెన్నెలతో నేసిన
ఊహల బట్టలు కట్టుకుని
ఆదికాలపు ఎంకీ ఎంకూ
ఆటల పాటల మాటలతో...
గిర్రున తిరిగిన కాలవర్తులంలో...
ఎన్నెన్ని కలుపు మొక్కలు
పిలకలేసి పాతుకున్నాయోనని...!
ఏరుగా సాగిన చరిత్రలో
ఎన్నెన్ని తిరోగమన శక్తులు
అడ్డుకట్టలేసి కులుకుతున్నాయోనని...!

సూర్యచంద్రులు
వాగర్థావివసంపృక్తాలుగా
వెలుతురూ చీకట్లు
ద్వా సుపర్ణా సయుజా సఖాయలుగా
ఉఛ్వాస నిశ్వాసలు
జడీభూత చలనాల త్వమేవాఽహాలుగా

తానే కర్తగా, తానే సాక్షిగా
తానే భక్తునిగా, తానే దేవునిగా
అంతర్యామిని అవగతం చేసుకుంటోంది...
అంతరాత్మ ...!
ఎవరీ అంతర్యామి...?
ఎక్కడివాడీ పథగామి...??

రెండు కాలాలను పేని
రేయింబవళ్ల వత్తిని చేసి,
గుండెలోని జలపాతాలు పిండి
నిండు నూరేళ్ళ ఆయువు పోసి,
జ్యోతి వెలిగించాలని
ఖ్యాతి కలిగించాలని
దృష్టి సృష్టించాలని
ఎన్ని తరాలు
ధ్యానించిందో ఈ అంతరాత్మ...!
ఎన్ని సిద్ధాంతాలు
జ్ఞానించిందో ఈ అంతర్దీపం...!
లోకం పాపాయికి
పురుడుపోసి లాలించాలని ...!!

# రెండు

'అది' మొదలు అనాదిగా
యంత్రిస్తూనే ఉంది అంతరాత్మ...
అంతశ్చైతన్యంగా!
అది మొదలు అనంతంగా
నేస్తూనే ఉంది అంతరాత్మ...
దేహం కలనేత చీరని
రంగులమయంగా!

ఆకలీ ఆవేశం పడుగూ పేకల్లా
అల్లుకు పోతూనే ఉన్నై
మహా సహనంగా!

ఎర్రదారపు కండెలా,
రక్తమాంసపు ముద్దలా,
సాగుతూనే ఉంది...
బతుకు అఖండ వస్త్రఖండంగా!

దేహం కలనేత చీరలో
పంచవర్ణాల మోహాలు
ఆత్మ స్వభావమా?

చీరలో పొదిగిన
బంగారు జలతారు ఊహలు
ఆత్మతత్వమా?

ఆత్మకు "వర్ణాలు" దేనికి?
దేహానికి "కులాలు" దేనికి?
రూపానికి "వర్గాలు" దేనికి?
నీకన్నా నేను వేరనటానికే!
నాకన్నా వేరెవరూ లేరనటానికే!
నేనెవరు? ఈ నువ్వెవరు?
కనిపించే దేహం సత్యం
కనిపించని ఆత్మ నిత్యం...!
తక్కినదంతా శూన్యం....
శూన్యం అబద్ధం కాదు !
మౌనం నిబద్ధమూ కాదు !!

ఎన్ని ఆలోచనల
భావ కశ్మలాల చెత్తకుప్పలు కమ్మినా
రంగూ రుచీ వాసనలు లేనిది ఆత్మ!
ఎన్ని లోకభీకర మారణ
శస్త్రాస్త్ర విన్యాస వినాశాలు ముసిరినా
లావణ్య విలాసాలు చెక్కుచెదరనిది ఆత్మ!

చుక్కలు లేని చీకట్లో
నూరేళ్ళ మఱ్రిమానైనా ఒకటే...
రేపనే ఆశలేని వాకిట్లో
నోరు లేని వెఱ్ఱి రాయైనా ఒకటే...

చీకటి... మరణానికి సంకేతం కాదు!
జీవితం... మరణానికి వేదిక కాదు!

నిరంతర పరిభ్రమణంలో
మృత్యు వొక గమ్యం!

అపరిపక్వ అపరిష్కృత చరిత్రగమనంలో
పుట్టుక ఒక మజిలీ!
బయలుదేరిన చోటుకి
చేరిందే బ్రతుకు...!!
తల్లిగర్భంలోంచి
పుడమి తల్లి గర్భంలోకి
చేరిందే జీవితం...!!!

మరణం వస్తుందని భూమి
సూర్యుణ్ణి వెన్నాడక ఆగుతుందా?
మరణం వస్తుందని భూమి
తనలో తాను తిరుగాట మానుతుందా?

అహరహన్మహాయానంలో
మరణించే బ్రతుక్కి
కాదెన్నటికీ దేహం వృథా!
మరణమే లేకుంటే
మనిషి సోఽహం కదా!

అప్పుడు...
తెలుసుకుంది అంతరాత్మ...
తెరుచుకుంది జ్ఞాన కవాటం...
అవధులు దాటిన అడుగుల్లో
సందేహాల ముళ్ళు తీసేస్తూ
సమాధానాల నల్లేరు మీదకు
తర్కాల చక్రాలబండి తోసేస్తూ,
సృష్టి అసలు రహస్యాన్ని...!

వ్యష్టి సమూహ సమష్టి సమీకరణాలు
ప్రబోధిస్తో సాగుతోంది అంతరాత్మ...
సంకోచంలో సంకేతం...
అక్షరాల్లో ఆశ్చర్యార్ధకంలా!
కోడెవయసులో ఆశ్చర్యార్ధకం...
ముదిమి మీరి వెన్ను కుంగి
ప్రశ్నార్ధకంగా నిలుస్తుంది!
సమాధానంలో సందేహం
ప్రత్యక్షంలో అనుమానమై మెరుస్తుంది!
ప్రమాణాలే ప్రమాణం కానప్పుడు
తర్కానికి చిట్కాలేమిటీ?
శిలాశాసనాలకే శిలువేసినప్పుడు
నుదుటి రాతకు విలువేమిటి...?

మనసులో మంచు,
మస్తిష్కంలో పులి,
ఉత్తప్త భూగోళం చుట్టూ
కమ్ముకున్న చలి!

జారిపోతోంది సూర్యుడి పగ,
తేరుకుంటోంది నేల కన్నీటి సెగ

పచ్చకర్పూరాల మాగాణి ధాన్యాలు
మరకత పచ్చ రజుక్రాల గుంటమాన్యాలు
చల్లారిన 'దాలిగుంట'చుట్టూ గారుగట్లు,
తెల్లారిన నేల మీద "సన్నగోరు తడకలు"

మెరుపులో మబ్బు సొగసులు
తటాలున కంటికానినట్టు...

మైమరపులో కుర్రనాటి ఊసులు
చటుక్కున యాదికొచ్చినట్టు...
పదునైన ఎదలో
పదారేళ్ళ ప్రాయాన్ని
పొదిమి పట్టినట్టు...

ఒంటికి బురదంటుతుందని
నేలను కాదంటుందా బీజం?
ఆకులు తడుస్తాయని
వానను మానమంటుందా వృక్షం?
చెమ్మగిలిన చెమటలో
రతనాల విత్తనాలు ఫలిస్తాయి!
చేవగలిగిన కండరాలకు
కొండరాళ్ళు వంగి నమస్కరిస్తాయి !!

చీకటికేం తెలుసు...?
వెల్తురులో
నాదాన్ని విరజిమ్మే తంతువులున్నాయని !

లోభులకేం తెలుసు...?
విత్తనంలో
నూరేళ్ళు రంజిల్లే జీవితాలున్నాయని!

మట్టిలో పొర్లిందనకు...
అంకురించిన ప్రతీ విత్తనమూ
స్వయం భూమిపుత్రమే!!
నల్లగా మాడిందనకు
సానపెట్టిన ప్రతీ బొగ్గుముక్కా
కోణాలు దాల్చిన వజ్రమే!

సమాధానాలను సమాధి చేయకు,
సందేహాల వటవృక్షం
ఊడలు దాలుస్తుంది...!
జ్ఞానాన్ని చీకటిలోకి తోయకు,
ఆదర్శాల గుండెలోకి
ఛాందసం కత్తి తటాలున దిగుతుంది...!

అప్పుడు తెలిసింది అసలు రహస్యం.....
జీవమున్నా ఆత్మ,
దేహానితో ముడిపడేవరకూ నిశ్చేతన!
జవమున్నా ఆత్మ
లోకానితో సరిపడేవరకూ జడన!

కనిపించని ఆత్మ నిత్యం...
కనుగొనని దేహం సత్యం...
కదిలించే చైతన్యం అందుకుంటే,
కదలాడే జీవుడు స్వచ్ఛం!
కరుణించే తత్వం రాజుకుంటే
కనరాని దేవుడే అచ్చం!
స్వచ్ఛమైన లోకాన్ని
స్వచ్ఛందంగా నిలిపే యత్నం!

అప్పుడు తెలుసుకుంది అంతరాత్మ-
వ్యష్టి అసలు సత్యం
సమష్టి అమలు తత్త్వం!

నిరీశ్వరుడైనా, శనీశ్వరుడైనా
నిరీక్షితమైనా, పరీక్షితమైనా

తురీయ వర్ణుడిదాకా
హరీత హారతులు అందరికీ!
గేలినందిన మానుకు
తేనె లలదిన పూలు అందరికీ!

కంటికిరణాలు ముసురుకున్నాయి
అడుగు జాడల్ని!
అంగాంగాలు కమ్ముకున్నాయి
అనుభవాల దారుల్ని!

దీర్ఘ చైతన్యం జూలు విదిల్చింది...
హృదయ స్పందనం అలలెత్తింది...

పాదాలలో పాకుతున్నాయి
పారాడే నదులు,
రాపాడే నాలుకలు!
నాదాలలో నాటుకున్నాయి
నవలెత్తే చరణాలు,
శిరమెత్తే హరిణాలు!

చిన్నబోయిన చెక్కుటద్దం ఎర్రనై మెరిసింది.
కంఠతావచ్చిన వేదమంత్రంలా
ఆకృతులు రూపుకట్టుకున్నాయి!
నాడులు విద్యుత్తరంగాలను
కమ్ముకున్నాయి!

'నిన్న'లు సముద్రంలోకి లాక్కు పోయినా,
'రేపు'లు ఆకాశంలోకి లేపుకు పోయినా,
'నేడు'లు నేలలో పాతుకు పోయినా,

'ఆకృతి'కి ఆలోచనే తోడు !
'ప్రకృతి'కి పురుషుడే రేడు !
ఆహార్యానికి అలంకారమే ఈడు !
ఆపాదమస్తకానికి ఆదర్శమే జోడు !

అయినా వెదికితే ఏదో లోపం...?
అంతరాత్మకదే పరితాపం...!

ఏదీ...
భావాలను సృజించే మనస్సు...?
జీవాలను జాగృతించే హవిస్సు...??
ఆశయాల పాత్రలో అభ్యుదయం పొంగులు,
భేషజాల హంగులు...
చైతన్యాన్ని చిగిర్చే హరిత భావాలు...
ఏవీ.... ఏవీ.... ఏవీ ???
బాణాకారంలో ఆశలు,
చక్రాకృతిలో ఆచరణలు...
కంటి చుట్టూ పిచ్చుక గూళ్ళు...
మెదడు చుట్టూ రాతిగోడలు...
నూనెలేని వత్తులు...
నేలనొదిలి కసరత్తులు...

ఏవీ...
నిరంతరం కురవాల్సిన హిమసమీరాలు...???
మన్వంతరాలుగా వెలుగురేడు
ఎక్కి తిరిగిన పడవలా ఆకాశం !
బతుకు పందెం గుర్రాల్లా చుక్కలు !
బారికేడులను దాటి దూకుతోన్నట్టు,

వెట్టిగాడిద వీపున
విడిచిన బట్టల మూటలు వ్రేలాడుతోన్నట్టు.

ఏవీ...
తరంతరం తెరచుకోవాల్సిన
కారాగార ద్వారాలు?

సత్యమైనా నిత్యమైనా దేహం
మనసుతో ముడిపడేవరకూ నిశ్చింతన!
ముసుగులోంచి బైటపడేవరకూ నిర్వేదన!
ఎక్కడుందో ఆ మనసు...?
ఎలా ఉంటుందో దాని సొగసు...!!

మనసుపైన మనసుపడి అనసూయాత్మ
స్వర్ణపత్రాల ప్రమిదలో ఘనసారం వెలిగిస్తోంది...
హారతులివ్వాలని !

రేపటి రేగడి మనసులో
దిగుబడి గుణాన్ని ఎరువేస్తోంది....
లోకం గాదెలు జీవులతో నిండాలని !!

# మూడు

విశ్వవీణకు తెలుసు...
మనసొక "నాదం" అని!
విశ్వగానానికి తెలుసు...
మనసొక "రాగం" అని!
విశ్వనాట్యానికి తెలుసు...
మనసొక "పదం" అని!
విశ్వకాంతికి తెలుసు...
మనసొక "కిరణం" అని!
విశ్వశాంతికి తెలుసు...
మనసొక "పరాక్రమం" అని!

చిరుగాలిలో చిగురుకొమ్మ
మృదుపత్రాల మునిమాపు వ్రేళ్ళతో
సరాగాల సరిగమలు పలికించి
తోట పాట పాటవంతో కలకలించి
విశ్వవీణను వికసించేది మనసు!

రాగంలోంచి మరో రాగంలోకి
ఒకేసారి అంతరంగ రాగరాగాలలోకి
తుమ్మెదలన్నీ ఏకశ్రుతిన గానించినట్టు,
కోయిలలన్నీ ఏకబిగిన ధ్యానించినట్టు,
విశ్వ గానాన్ని విప్లవించేది మనసు!

అణువులో పరమాణువుల్ని కదిలించి,
తథిగిణతోం నడకల మెలకువల్ని నేర్పించి,
లయాన్వితంగా నర్తించి,
పదార్థంలో పరమార్థాన్ని ప్రాదుర్భవించి,
విశ్వనాట్యాన్ని విస్తృతించేది మనసు!

పగబట్టిన పొగమంచును కరిగించి,
పగలు పొగిలించి, పొగలు రగిలించి,
కోటి గొంతుల ఆర్తనాదాన్ని
తోటి గుండెల్లో వెలిగించి
విశ్వకాంతిని విద్యుదించేది మనసు!

పిడికిలిలో, కొడవలిలో
చైతన్యం ఒరవడి కొరవడిన
బానిసత్వంలో
'మంద'మతి వారసత్వాన్ని
పరదేశాపవాహనా వ్యామోహాన్ని,
మోహనాన్ని,
హననాన్ని
తిరగేయాలని, తిరగబడాలని
తిరిగితిరిగి తలపడాలని,
తలపండాలని
విశ్వశాంతిని విక్రమించేది మనసు!

ఆరడుగుల ఈ కట్టెను
కట్టెమంటలు కమ్ముకున్నట్టు...
గట్టు చుట్టూ అలలు తలలు ఎగరేసినట్టు...
ఏదో రాగంతో, ఏదో భావంతో

పొలిమేరనుండి గాలి తెచ్చిన
నులివెచ్చని వెలిబూదిలా!

శబ్దానికీ స్పర్శ ఉంటుంది!
స్పర్శలోంచే జీవితం
పురుడు పోసుకుంటుంది!

పుట్టుకకన్నా ముందే
పుట్టుక ముందా...? మరణం ముందా?
పుట్టుక తర్వాత చావు
చావు తర్వాత పుట్టుక
పుట్టడమే చచ్చేంత చావు!

ఏ చలనం
పేము బెత్తం పుచ్చుకుందని
ఏరు వణుకుతూ పారుతోంది...?
ఏ స్పందన చెవి మెలిపెట్టిందని
భూమి బుద్ధిగా తిరుగాడుతోంది...?
ఏ కిరణం
పాదాలకు వేగాలు పులుముకుందని
వెలుతురు తిన్నగా దూసుకుపోతోంది?

ఏమీ ఈయదనుకునే ఆకాశం
వాన చినుకులు వరదలెత్తిస్తుంది!
ఏమీ లేదనుకునే అంతరిక్షం
వెన్నెల కాంతిని ఒలకబోస్తుంది!

గుండె దిబ్బెనలో దాచిన చెల్లని నాణెం...
కాలానికి సంకేతం!

కపాలానికి తగిలించిన రాజమకుటం...
దూరానికి ప్రతీక!
కాలమూ దూరమూ ప్రేయసీ ప్రియులు!
ఒక క్షణికం దగ్గరగా,
ఒక మన్వంతరం దూరంగా,
దూరం  దూరం అయితే కాలం అవ్యక్తం!
దూరానికి దగ్గరైతే కాలం అనంత ప్రోక్తం!!

మనసూ అంతే...!
తాను 'మట్టి' అయితే
ద్విహల్య త్రిహల్యాలతో
ధాన్యమేరువులు పండిస్తుంది!
తాను 'రాయి' అయితే
'అహల్య భూమి'ని
మహాసౌధాలతో నిండిస్తుంది!

మనసు ఎప్పుడూ అంతే...!
తనలో అనురాగ పొరలు పరచుకుని
ఆలోచనా ధారలు చిలకరిస్తుంది
తనకు అనుభవాల సంకెల బిగించుకుని
ఆర్ద్రత చెమ్మగిస్తుంది, రౌద్రత ఉమ్మగిస్తుంది!

ఒక వంక ఎర్రగా, ఒక వంక పచ్చగా,
రెండు ధ్రువాల బొంగరంలా!
వేయి అక్షాంశాల గుమ్మడి పండులా!
ఎరుపు, పచ్చలు
అచ్చుబొమ్మలు బతుకు నాణానికి!
రాత్రీ పగలూ లేని రోదసి రూపానికి!

పరంపరానురాగ పరాగరేణువులను
పువ్వులో నాటితే
కాయై పండుతుంది!
సారంగరాగరాగాను బంధాలను
నెత్తురులో చల్లితే
ఆర్ద్ర హృదయం మొలకిస్తుంది...!!
ఆత్మ మనసు చిగురిస్తుంది...!!

చిగురించే తోటలో
కరిగించే పాట... మనసు!
కరిగించే పాటలో
కరుణించే 'చరణం...మనసు!
కరుణించే చరణంలో
కదిలించే 'భావం' మనసు!

కదిలించే భావంలో
కమనీయ 'లయ'....మనసు!
కమనీయ లయతో
కదలాడే నాట్యం... మనసు!
కవితలో నడక మనసు!
నడకలో కవిత మనసు!

మౌనం చెరిగి మాంద్యం విరిగి
ఆత్మ 'మనస్సు'లో అదే సంభ్రమం...

ప్రసరించే నాళాలను కాదని
రక్తం-
కాళ్ళు ముడుచుకుంటుందా...?

నిద్రించే కళ్లను కాదని
కల-
మెలకువలో జీవిస్తుందా...?

కళ్ళు తెరపిలబడి, చూపు విప్పారి
ఆత్మ 'మనస్సు'లో అదే సంశయం...
మబ్బు నించి జారిపడే
వాన చుక్క త్వరణంగా-
మట్టి నుంచి ఎగిసిపడే
అణుధార్మిక కిరణంగా-

అది అనుభవాల జల!...
జటాజూటంలో చిక్కుకున్న ఆకాశగంగ!
తేనె పురుగులు కమ్ముకున్నట్టు
గిజిగాడు గూళ్ళు అల్లినట్టు
అన్నీ భావజాలాలే,
సాలోచనా జలపాతాలే...!

మనిషి వయసంత మనసులో
తరచి చూసినన్ని విషయాలు
ఎక్కడ నిలవున్నాయో...?
లోకంలో జీవరాసులన్నీ
మనసు ముంగిట శిరసు వంచి
ఎక్కడ నిలిచివున్నాయో...?
మనసొక రూపం దాల్చిన కల!
మనిషొక వేషం తుడిచిన నటన!!

తానేమో...
ఎక్కడో మూలగా వొదిగివొదిగి...!
తన చూపుల్ని విశ్వమంతా పొదిగి...
తన రెక్కల్ని బారలా చాపి,
తన కారుణ్యాన్ని లోకమంతా చూపి
తనను తాను వంచించుకునే మనిషి
తన గుండెల్లో పొదుస్తున్నా
చేవ చెదరని
మేలిమి మానై నిలుస్తుంది!
సేవ చెరగని
చెలిమి బంధమై పిలుస్తుంది!

ఎక్కడిదీ మనసుకు ఆ శక్తి...? ఆసక్తి...?
ఎంతటిదీ జీవ జీవాంతరంగ అనురక్తి...?

ఉపకారానికీ అపకారానికీ
ఉపాయానికీ, అపాయానికీ
ఉజ్జయానికీ, అపజయానికీ
పాపానికీ, పవిత్రతకూ
అంతరాలెంచని ఆచరణ... మనసు!

ఆలోచనలను మాడ్చే
ఆకలి ఎండల కాలంలో
అంబలై తొలకరిస్తుంది... మనసు!
తనను పిండి ఎండేసే
మొండి చేతులకు
ఊతమై నిలుస్తుంది...మనసు!
తనకు అందీ అందని

పుల్ల ద్రాక్షలకు
పందిరై పండిస్తుంది...మనసు!

తప్పదు మనసుకు
ద్వంద్వత్వం
వెలుతురూ చీకట్లతో బంధుత్వం!

అచ్చమైన మనసుకు
స్వచ్ఛతనిచ్చే గుణాలను
వెదుకుతోంది.. అంతరాత్మ !
మచ్చలేని మనసుకు
అక్షయమైన మనుగడను
చాపలా పరుస్తోంది... అంతరాత్మ !!
మనసుకో గూడు కావాలని !
గూటిలో ఊపిరులు
ఊయలలూగాలని !

# నాలుగు

ప్రకృతి
లోకానికి స్వంత ఇల్లు!
గోడలు కూడగట్టుకుని,
తలుపుల్లో చెదలతో, తలపుల్లో రొదలతో
జీవిస్తాడు జీవుడు అన్నీ వదిలేసి!
కాలంతో కలహాల కాపురం...
విధిర్బలీయసీ...!!

కచ్చికతో తోమిన సత్తుగిన్నెకి
అచ్చువెండి కంచంతో
అచ్చికబుచ్చికలాట...
ఇచ్చకాల రోజులు!
బంగారుబల్లి వచ్చి పడినా
సత్తుగిన్నెకేం లెక్క!
దాని వెన్నెలవెలుగు దానిదే...

అంటు కడుగుడంతా
పన్నీరు స్నానమే సత్తుగిన్నెకి,
గంటుబడ్డా
బంటుతనం పోతుందా?

తోమినకొద్దీ మెరుస్తుంది గిన్నె!
తోమింది చాలకే,
జిడ్డు ముఖాన కిలిమి చారలు!

అవి ఎరుపెక్కిన ప్రేమజాడలా?
గిన్నె సహజ రూపాలా?
పై మెరుగంతా మాయ!
మాయను తుడిచేస్తే గిన్నే మాయం.

పొయ్యి నెక్కాలని
ఎందుకో గిన్నెకంత యావ...
ఎర్రగా కాలితేనే గిన్నెకి వన్నె!

పొయ్యిమీంచి అంట్లతొట్టెలోకి,
కడిగిన ముత్యమై మళ్ళీ పొయ్యిపైకి!
వంటికి బూడిద పులుముకుని
పొయ్యి నెక్కుతుంది గిన్నె
ఏది శాశ్వత మే దశాశ్వతం?
పొయ్యిలోనూ మిగిలేది బూడిదే!

పెంజీకటికి ఆవలా... ఈవలా,
మధ్యన జ్వాజ్వల్యమానంగా పొయ్యి
పొయ్యి మీంచి దించానని గిన్నె
మెచ్చి ఇచ్చిన ఇనామే అన్నం...

అండపిండ బ్రహ్మాండాలు
గిన్నెలో బ్రహ్మాండంగా ఉడుగుతాయి!
మాంస 'కండకావరాలు'
'మీమాంస' లేకుండా ఉడుగుతాయి!

మన పప్పులు ఉడికేది ఇందులోనే
మన తప్పులు ఉడిగేదీ ఇందులోనే
గిన్నెలోది అందరి సొత్తు...
గిన్నె మన 'అబ్బ' సొత్తు!

జీవుడికి జీవాన్ని పోయాలని... ప్రకృతి!
జీవానికి  సుఖాలు అమరాలని...దేహం!
దేహానికి అలంకారాలు తీర్చాలని...మనసు!
మనసుకు చేతనత్వం అమరాలని...ఆత్మ!

ఎప్పుడో వచ్చే మరణానికి
ముందే 'గయాశ్రాద్ధం' దేనికి?
ఎప్పుడో వచ్చే వార్ధక్యానికి
ముందే గొడుగుకర్ర దేనికి?

సత్తుగిన్నెలో 'సత్తు'
ఉనికి నిలుపుకునే యత్నం
చిత్తుప్రతిలో 'చిత్తు'
చిత్తం నింపుకునే సత్యం
సత్తు, చిత్తు, ఆనందం
గిన్నెలో కలగలిపి
చితిపొయ్యి నెక్కితేనే
జీవుడి వేదనా పరిపాకం!

వెలుగు టాకులతో  గుడిసె కట్టుకుని,
కాంతిస్వప్నాలతో  కడుపు నింపుకుని,
'గుహ' జీవితం లోంచి 'సహజీవనం' లోకి...
నిరీక్షణం లోంచి గవేషణం లోకి...
ప్రసరించిన కాలాన్ని
కత్తిరించి చొక్కా కుట్టించుకుని
లేని మీసాలకు వాసనలేని
సంపెంగ నూనె పులుముకుని,
ఎదురు చూస్తోంది మనసు....
సూర్యుణ్ణి స్వాగతించాలని!

ఏవేవో మనసారా చెప్పుకోవాలని,
మనసులో ముడులు విప్పుకోవాలని,
అడగందే వరాలిచ్చి,
తానున్నానంటూ భుజం చరిచి,
కనిపించని చేతులేవో వచ్చి
కనికరించి నడిపిస్తాయని...!
కాయలకళ్ళతో
కానని కోనలు చూస్తోంది
మానవచకోరం.....!

ఈ సృష్టిలో తనదంటూ ఏదీ లేదా?
తనకంటూ ఏమీ రాదా?

ఆశల పూవులు
పండ్లై పరిమళించిన రోజు
జగానికి అసలైన ఉగాది!

చిరిగిన చొక్కా గాలి కెగిరి
గడ్డిపరకలా సుడి తిరుగుతోంది.
సూర్యుడికదే స్వాగతం!
చీకటికది తుది వీడ్కోలు!!

అంతరిక్షం రహదారిలో
నీడకోసం పెరిగిన వటవృక్షంలా
చుక్కల ఊడలు దాల్చింది...జాబిల్లి!
బానిసత్వం బలిసిన చోట
విముక్తినిచ్చే విప్లవ తరంగంలా
రసాయన చర్య లందింది...అగ్నిజల!

కాలం కాల్చిన పావురాళ్ళను మెక్కి
పూతను పుక్కిలించి,
కోకిల కూతను వెక్కిరించి
కరువు రాకాసి పొగరు నాట్యానికి
అణగారి పడుకుంది...అస్థికల శిల!

తరచి తరచి చూసింది అంతరాత్మ...
మనసు తెరపైన అనేక రూపచిత్రాల్ని!
కదలకుండా పలికే పదచిత్ర వైచిత్ర్యాల్ని
'తెల్లజాబిలి'కీ, 'అగ్నిజల'కీ,'అస్థికలశిల'కీ
ఏమిటో పోలిక? ఏవరీ మూడుగుణాల ఏలిక?
ఏలిక మనసే...!!

మనసు...
గడ్డిపరకని మంత్రదండంలా మలచగలదు!
గులకరాయిని చెకుముకిలా జ్వలించగలదు!
విద్యుత్తరంగాన్ని ఉక్కుతీగలో బంధించగలదు!

ఏ మంత్రదండం
సత్త్వగుణమై పాలిస్తుందో,
ఏ విస్ఫులింగం
రజోగుణమై చైతన్యిస్తుందో,
ఏ విద్యుద్బంధనం
తమోగుణమై నియంత్రిస్తుందో,
ఏ మనసు
త్రిగుణాత్మకమై వికసిస్తుందో
ఆ మనసును
మనసారా హత్తుకుంది అంతరాత్మ...

ఆ మనసును చేతనామూర్తిగా
మలచుకుంది అంతర్యోగి...!!

సత్త్వం సాధన చేస్తే సత్యం పుడుతుంది!
రజం రాజ్యం చేస్తే సత్యం గెలుస్తుంది!
తమస్సు తపస్సు చేస్తే
సత్యం నిలుస్తుంది!

ప్రొద్దు పొడుపెందుకు...?
పట్టపగ్గాలెరుగని చీకటి గుర్రాలకు
కళ్ళాలు వేసేటందుకు!
ప్రొద్దు విడుపెందుకు?
సముద్రపు ఆర్తనాద ఘోషకు
ఆమోదముద్ర వేసేటందుకు!

దుఃఖ వారాశి సృష్టికి జీవం పోసింది!
సుఖ సమీరం సృష్టికి ఊపిరై నిలిచింది!

ఆనందం క్షణికం అంటాం గానీ,
మనసుకు పర్యాయ పదం శాశ్వతమే!
మనో ద్రవ్యాలు గుణవత్తరమే!

అప్పుడే కలిగింది మనసుకు
అసలు సందేహం...
'నడిచే చైతన్యం ఉన్నా
నడిచేది తాననే ఎరుక ఏదీ?
ఎగిరే పక్షికైనా
ఎగిరేది తాననే సోయ ఏదీ?
గుండె కోనలో పిక్కటిల్లిన ప్రతిధ్వని

తన ఘోషేనని...
మంచుకరిగిన నీటిలో
పరిహసించిన ప్రతిబింబం
తన అట్టహాసమేనని...
తాను తానేననే స్పృహ
జీవికి కలగాలని...!

పువ్వుల మీద ఒట్టేసి
తుమ్మెదలు ముఖం చాటేశాయి!
పండుటాకుల్ని ముందుకు నెట్టేసి
మొక్కలు పక్కకు తప్పుకున్నాయి!
విత్తనాల పొత్తిళ్ళకు గాయాలు చేసి,
పక్షులు పైకెగిరిపోయాయి!
ఉగ్ర చేతనలు దీనంగా
నల్లని చీకటి చేతుల్లో నలిగి పోయాయి!

సుడి మంటల కెరటాలెక్కి
రాజుకొస్తోంది...
ఇసుకని కరిగించే ఎండ-
గట్టును నెత్తిన మొట్టి,
కస్సుమంటోంది ఎండునది
ఒకనాటి జీవమది !

ఇదేం నదీ...!
ఇరుగట్టుల మడతమంచం మీద
చీకటి దుప్పటి కప్పుకుని
అనంత శయనంలా...
సాలోచనగా శూన్యంలోకి చూస్తూ!

దుప్పటి కంతల్లోంచి
చుక్కలు తళతళ లాడుతూ...

నది ఒడ్డున తాడిచెట్టు
అనంత శయనుడి
నాభిలో పుట్టిన కమలంలా...
పైన పద్మాసనంలో చంద్రుడు
తెలుగు లీనుతో
కమలపు రేకుల్లో కర్ణికలా...

నది నిజం!
ముమ్మాటికీ నిజం నిజమే!
నదిలో నీళ్ళే మిథ్య!
ఆక్రమించిన భవంతులు నది మధ్య !!

నదినిండా మొక్కలే
మొక్కులు తీర్చుకునే పరివార దేవతల్లా...
బ్రహ్మజెముడు, నాగజెముడు, కలబంద!
నదిమీద సాలీడు గూళ్ళ అల్లిక
ఏ కవి అల్లగలడూ అంత సీసమాలిక!

శిలలు చెక్కుకున్న కలల శిల్పాలు
తలలు విరుచుకు నేలవాలాయి-
ఇసుక తిన్నెల్లో పిచ్చుక గూళ్ళు
వెన్ను విరుచుకు కుప్ప కూలాయి-
సాదరంగా చూసే నది లేదు
మురిపెంగా నవ్వే పంట వెంట
పలకరింపుల కిలకిలలు లేవు,

సంపన్నంగా సత్కరించే
చేమంతుల హేమంత సీమంతాలు లేవు,,,!

చంద్రుడి వెలుగురాగాలు
నదిలో కనిపించిన రోజులు
అప్పుడు! అప్పుడప్పుడు!!
గట్టును గట్టిగా తగలకున్నా
నీళ్ళ జాడలుండేవి అప్పుడు...
మల్లెలూ పండేవి అప్పుడప్పుడు...

చీకటి దుప్పట్లో దూరాక
నదికి నీళ్ళైతే ఏమిటీ...?
ఇసుక దిబ్బలైతే ఏమిటీ...?

నదిలో నీళ్ళు గతం
బీళ్ళు ఎండకు అంకితం

నదికి నీలం రంగు పులిమి
నీళ్ళని భ్రమిస్తున్నాం
కాళ్ళని తడిపి
కాకిస్నానం చేస్తున్నాం!

నదికీ తెలుసు సైకో అనాలిసిస్సు!
మమతలు లేని మనుషుల సారోసిస్సు!!

నీళ్ళున్న రోజున
దానిది సత్త్వగుణం
అది అప్పుడప్పుడూ...
వరదలెత్తిన రోజున

దానిది రజోగుణం
అది ఎప్పుడో ఒకప్పుడు...
నీళ్ళెండిన రోజున
దానిది తమో గుణం
అది సర్వసాధారణ దృశ్యం!

మహాసాగరం మధ్య మైనాకినిలా
పంటచేనుమధ్య పరిగెల పోగులా
చేతనత్వంలో శూన్యత్వం ఎక్కడిది...?
విద్యుద్వలయం మధ్య
విద్వత్తులేని పండిత ప్రకాండుల
కొయ్యకండ లెక్కడివి??

నదిని బంధించే వృత్రాసురుడు
యుగానికొక్కడు ప్రతిసారీ
ఎగువకు నీటిని మళ్ళిస్తూ మితిమీరి!

పదండి ముందుకని తోసుకుని...
నీళ్ళు పాటెత్తుకుంటే, పోటెత్తుతుంటే...
చలనాన్ని ఆనకట్టలా ఆపేది?
చైతన్యాన్ని మాయకట్టులా మాపేది...?
నది ఆగనిది!
నది దాగనిది!
నది జీవనిధి!
నది జీవన విధి!

అవగతం అయ్యిందప్పుడు
ఆత్మ మనసుకు...

తనను తననుగా నిలిపేది,
తనను తీగగా శ్రుతించేది,
తనను గీతగా ప్రార్థించేది,
తన అస్థిత్వంలో
తన ఉనికిని విస్మృతించేది,
ఏదీ... నేననే భావం...?
అహంకార వాదం...? భీంకార నాదం...?

ప్రవహించే నదికి పరిగెత్తే చలనం...నేను!
సంచలనం 'నేను'!
వికసించే పువ్వుకు పరిమళించే గంధం...'నేను'!
అందం 'నేను'!
ఫలించే రేగడి నేలపై చిమ్మిన చెమ్మను...'నేను'!
నేల అమ్మను 'నేను'!

"నేను" లేని వెన్నెల
అడవిలో కాచి అలసిపోతుంది!
"నేను" లేని నేల
తనను తానే తవ్వుకు కృంగిపోతుంది!

"నేను" ను పొంది,
"తాను"ను ప్రభవించింది
ఆత్మ మనస్సు...
ఊహానుభవాల ఉషస్సు...

నాడీ తరంగం నడచి వచ్చింది
మస్తిష్కపు పొరల్లోకి!
ఆలోచన సాగింది

నాడీ నురగల తరగల వెంట...
మనసు లోగిల్లోకి!
జ్ఞానం జాలువారింది
స్మృతిరేఖల కోణాలలోకి!

వేకువతల్లి ప్రభవించింది
బాలభానుణ్ణి
లోకం పొత్తిళ్ళలోకి!

శోకం పెదాల చివర
చటుక్కున మెరిసిన
చిరుదరహాసం...సూర్యోదయం!!
లేయెండ కెంజాయి
సత్త్వ రజస్తమోగుణాల మయం !

# ఐదు

మెత్తుకున్న మట్టిగుడిసెలో
ఎత్తుకున్న బరువుల్ని
దించుకుని
పంచుకున్న అనుభవాల్ని
మెత్తగా పరుచుకుని,
అందరాని అందలాలను
చెల్లని పుల్లని రసంలో
నంజుకు తింటోంది లోకం...!

తన కడుపు నిండాక
నిండుకుండలా అనుకుంది,
హాయిగా ఉంది తానేనని!
ఆ కడుపే ఖాళీ అయితే,
కుండ నిండుకుంటే
తలక్రిందులై,
ఘటవాద్యమై
గగ్గోలు పెట్టేదీ తానే!

లోకం తీరే వేరు...
అది–
నీళ్ళున్నప్పుడు ఎగువకు పారే ఏరు!
ఆంక్షలు దానికి చెల్లవు...
కాంక్షలు ముదిరి
ఆలోచన్లు వె'నక్కి' మళ్ళవు!

కడుపు నిండితే
కనురెప్పల పైన రవిచంద్రులు
నిలవాలంటుంది!
కడుపు మండితే
చూపుల జ్వాలనాలతో
రోదసికి నిప్పెడుతుంది!
గొంతులో గమకాలతో
యుగాంత ప్రళయం సృష్టిస్తుంది!

హతులూ, హంతకులూ
రెండు శక్తులు లోకానికి...
సేవలూ దోపిడీలూ
రెండు గుణాలు లోకానికి...

గాంధీ వసంతంలో
శాంతిపూలు పూస్తుంది
గాడ్సే గ్రీష్మంలో
అరాచకం ముళ్ళు వేస్తుంది

గాంధీ గాడ్సేలు
రెండు అంశలు లోకానికి-
నిర్మాణం విఛ్ఛిన్నం
రెండు ఆంక్షలు లోకానికి-
నిర్మాణం కోసం
విఛ్ఛిన్నానికైనా వెనుదీయదు
బానిసత్వం...మానవత్వం...
విఛ్ఛిన్నం కోసం

నిర్మాణాన్నే నిలవనీయదు
అధికారం...అహంకారం...

లోకం కోరికే అంత!
సూర్యుడికీ భూమికీ మధ్య
అంతే అంతరం నిలవాలంటుంది!
సూర్యుడు భూమికి
నిరంతరం'
కాపు తిరగాలంటుంది!

ఏ శాసనం
పగలబడి ప్రకటించిందని
జరుగుతోంది–
ధనస్వామ్యం వెంట
జనం తిరగటం...?
ఏ రాజసం
కొవ్వెక్కి శాసించిందని
జరుగుతోంది–
జనాన్ని వెంట తిప్పుకు
ధనం కులకటం...?

తరాలుగా జరుగుతూనే ఉంది...
జనస్వామి
తన చుట్టూ తాను తిరుగుతూ
ధనం చుట్టూ తిరగటం!
ధనానికి తెలుసు జనం అవసరం...
జనానికే తెలియదు ధనం పెడసరం...

అంతరంగంలోకి అంతర్లయగా
ప్రవహించి చూస్తే
తప్పకుండా కనిపిస్తుంది
చెరిగి పోతూన్న నిఖిల జనస్వామ్యం!
కరిగిపోతూన్న సకల రక్తమాంసం!!

దిగ్భ్రమించింది ఆత్మ మనసు-
యుగాల తరబడీ
జీవాల కోసం
తపించిన తాను
దిగాలై చతికిలబడింది-
పిడుగుల అడుగులతో
తరాల అంతరాలను దాటిన తాను
మూగగా మూలిగింది-
ఎగిరిపడిన కడలి తరంగానికి
తిరిగిలేచే శక్తిగా నిల్చిన తాను
జడంగా బండబారింది-

వేగాలు పులుముకున్న పాదాలు,
వేదనాదాలు పలికిన గాత్రాలు
మూలపడిన అస్త్రాలైనాయి!
వలిత కిసలయాన్ని
వీణగా మోగించిన వ్రేళ్ళు
చెట్టు చిగిర్చిన శబ్దాన్ని
వృక్షమల్హారిగా గానించిన నీళ్ళు
నోళ్ళు కట్టుకున్న బీదలైనాయి!

అందలం ఎక్కించిన వాడు
అందరి నెత్తినా అడుగు మోపుతుంటే,
అందరూ కలిసి
ఏక కంఠంగా జేకొట్టిన వాడు
అందరి కుత్తుకలూ అణగ తొక్కుతుంటే,
నీవార శూకం
గుండెలోతుల్లో కలిచినట్టు,
కరవాల ధారా నిశితం
కండకండనీ వొలిచినట్టు,
బాధగా మూలిగింది ఆత్మ'మనసు'
పూలపాన్పు కట్టెల పోగైనట్టు!

మెత్తుకున్న మట్టిగుడిసెలో
తన ఉనికి కానరాలేదు
ఎత్తుకున్న బరువులు
దించుకునే చోటులేదు

తిరిగే బొంగరం మీద...?
ఇసుకరేణువు నిలబడ్తుందా...,?
కరిగే మట్టిబొమ్మకు
రంగేళీ అలంకారం పట్టుబడ్తుందా...?

ఆత్మకు అదే ఆందోళన...
మనసు పొందు పొంది
'నేను'తత్వం మిత్రత్వమంది
తాను సాధించిందేమిటీ...?

పోరాడే సత్యాన్ని
రాపాడే అగ్నిని
తన గుండెలో పొదుగుకుని
తాను రగిల్చిందేమిటీ...?
యుగాలు నిరీక్షించి
జగాలు పరిక్షించి
తాను చేసుకున్న
జీవపదార్థంలో జీవమే లేనప్పుడు
తాను మిగిల్చిందేమిటి...?

నరులు నరులు కాలేరు,
వనరులు వానరులవైనప్పుడు!
సిరులు దానవులవైనప్పుడు

తానే నేలతల్లయితే
అగ్ని పిండంలా ఉన్న భూగోళం
ఎంతకాలం తనకోసం నిరీక్షించిందో...
పొంగిపొరలే జీవపదార్థంలో
కాగితం పడవలేసుకుని
లోకం పాపాయి ఆడుకుంటుందని!

తానే నీటి తండ్రయితే
గొంతెండి ఎండిపోయిన భూగోళం
ఎంతకాలం తనకోసం పరితపించిందో...
మరిగి ఇగిరే జవసత్వాలతో
ఆవిరియంత్రం చేసుకుని
లోకం పాపాయి ఊరేగుతుందని!!

ఆకాశంలో వెలుతురు నదులు
చల్లగా...
నేలపైన వేడి ఆవిరులు
కడుపు మంటగా...

ఎండలో నీడ కాంత
ఎండమావి చీరకట్టి
వయ్యారంగా నడిచిపోతోంటే
నీరనుకుని వెర్రిగాలి
వెంటపడి పరిగెడుతోంది...

ఎండలో మేఘ రాకాసి
సూర్యుడి కడ్డంగా నిలిచి
మంటల్ని జడలో తురుముకుంటే
మెరుపులనుకుని మట్టిబొమ్మ
వానకోసం నోళ్ళు తెరుస్తోంది-

మబ్బు గర్భవతి ఎదురు చూస్తోంది
తనకు సుఖప్రసవం చేసే
శీతవాత వైద్యుని చల్లని స్పర్శ కోసం...
నక్షత్రాల మేథావులు  నిరీక్షిస్తున్నారు,
తమ దుశ్శకునాల దుష్కాలాన్ని
చెరిపేసే శుభపంచాంగం కోసం...
ఉషోదయం క్రాంతికారులు
పోరాడుతున్నారు,
తమని మాడ్చి మసి చేసే
సూర్యుడి నియంతృత్వాన్ని చిదిమేసే
చల్లని 'వెన్నెలమతి' కోసం...

కళ్లకనుమల్లో
కన్నీళ్ళ నదులు లేవు,
గుండె నిప్పుగుట్టలు బద్దలైనా
మంచినీళ్ళ సరసులు లేవు,
నాసికా పుటల్లోంచి వీచే గాడ్పుల్లోంచి
తేమని ఏమని ఏరుకోగలం?
ఎండిన పొలాల బుగ్గల్ని చిదిమితే
ఎర్రగా కందుతుంది చైతన్యం!

అది ఎముకల బొమ్మా...?
కాదు–
కరువు అణ్వస్త్రాలకు బలైన
మానవ హిరోషిమా!

అప్పుడు తెలిసొచ్చింది అంతరాత్మకు...
ప్రకృతి పరవశింపులు నిష్కృతి కలిగించవని!
మనసు పులకరింతలు కడుపు నింపవని!

చెకుముకి రాయి రాపిడిలో నిప్పులా
లకుమికరుడి ధ్యాన్నంలో దయలా
జీవుడి వేదనలో జ్వలించే చైతన్యం
కావాలి...! రావాలి... !!

అలలెత్తే చూపుల
సముద్రాల సమూహాలు
మేఘాలనంటి లేస్తున్నాయి–
శివమెత్తే నడకల నాదాలు
గ్రహాలవిగ్రహాలు దాటి
తొంగి చూస్తున్నాయి....

నూతిలో ఎడారి నిద్రలేచింది!
హుషారుగా గిలక
చిలక పాట పాడింది...
అటకెక్కిన బొక్కెన
అట్లతద్ది నాటి తెలుగమ్మాయిలా
ఛెంగుఛెంగున ఎగిరింది...
నూతిలో రాళ్ళు
రక్తమాంసాలలముకున్నాయి!
ఆకులూ పూలూ
శాంతిగీతాలాలపించాయి!
పంచజ్ఞానేంద్రియాలూ
ప్రత్యక్షాన్ని ప్రతిఫలించాయి!
పంచ కర్మేంద్రియాలూ
సృష్టికి కర్తలుగా నిలిచాయి!

కళ్ళు విచ్చి చూసింది
అంతరాత్మ-
పొడుచుకొచ్చే చైతన్యాన్ని!
పోరాటం ఆరాటాన్ని!!

మెత్తగా పలికే
మూగగొంతు నులిమితే
ఉరిమి పడ్తుంది సముద్రఘోష...
సన్నగా కదిలే
ఊపిరితిత్తును తొక్కితే
ఉబికి వస్తుంది ప్రళయాంత ఫెళఫెళ...

అదేమిటీ...
రాకాశి హస్తం సూర్యుడికడ్డంగా -
ఏమిటవీ...
వ్రేళ్ళ సందుల్లోంచి
వెల్తురు చారికలు...
దోసిళ్ళలో పడితే
జలపాతం అగుతుందా?
దూసుకు వస్తుంది
చైతన్యం లోగిలికి!!

మొక్కకు మళ్ళు చేసి
ఊపిరూదింది ఏరు-
ఒడ్డుకు నీళ్ళు పోసి
ఊరించింది అల-

వేయి వాద్యాల నాదాలతో
సత్యాన్ని సంధించే శబ్దాన్ని
ప్రవచించింది
జలపాతపు హోరు-

అడుగుల మడుగులపైన
అవధుల పరిధులు దాటి
పరిక్రమించింది మహాసముద్రపు తేరు

మృత్యువు కాలిజాడలు చెరిగాయి...
ఉన్మత్తుల గజిబిజి బాటలు చెదిరాయి...
అల్లని పాటలా,
జనం ఒల్లని మాటలా

నల్లని పగళ్ళు తెల్లబోయాయి...
చెల్లని నకళ్ళు వెల్లబారాయి...

ఇది ప్రకటించిన అఖండ గమనం!
ఇది ప్రదర్శించిన అనంత గమ్యం!

"ఎడారికి గోదారికి
నడుమ నా రహదారి...
అణుప్రకంపనాలకు
చిరుచేమంతుల ప్రభంజనాలకు
నడుమ నా సవారి...
నాక లోకపు చేదు గుర్తులు
దాటి నా పయనం...
నాదకర్తల
పాదముద్రల వెంట నా గమనం..."
అని పలికింది
ఆత్మజ్ఞానాన్ని పొందిన మనసు
పరమ సౌమ్యంగా!

జన్మభూమిని వల్లకాడు చేసి
బంగారు రేగడిలో
ఇసుక గుట్టలు పోసి,
విత్తనం నాటిన చేతులపై
వాతలుపెట్టి కాల్చి,
పెత్తనం కులుకుతుంటే
ఆత్మజ్ఞానం
చేతలుడిగి కూర్చోదు!

జనం మౌనం
బ్రద్దలు కాకపోదు!

ఇన్ని పువ్వుల హక్కు భుక్తిని
తుమ్మెద ధనస్వామి
తనకోసం తన కోశంలో నింపుకుంటే
వేల స్వేదబిందువుల ఫలాన్ని
శూన్యం ఒక్కటే
పుక్కిట పట్టి కులుకుతుంటే
సహనం ఎంతకాలం...?
ఇది సమరం తప్పని నేరం...!

మూర్ఛపోయిన క్రౌంచపక్షి
రణదుందుభి మ్రోగించింది...
పీక తెగిన కోడి కూత
జాతి వీరుణ్ణి నిద్ర లేపింది...
కోట తలుపులు బీటకొట్టి
కీటకాలు శూలాలు పట్టి
కోలాహలించాయి-

ఎత్తిన పిడికిలి
నన లెత్తిన కెరటమై ఎగిరింది!
పూవులు జ్వాలలయ్యాయి!
ఆర్తుల గాథలయ్యాయి!!
కోపంలో నానిన ఊహ
ఊడలు దాల్చిన వృక్షమయ్యింది !
శాంతంలో ఊరిన సహనం

ఎర్రగాలై సుడి పెట్టింది...
చేతకు చేవగా చెలరేగిన
చిగురుటాకు చెట్టును చుట్టుముట్టింది...

విరోధి-తనకు తానే ఉరేసుకున్నాడు!
నిరోధి-తనను తానే పొడిచేసుకున్నాడు!

చైతన్యం ఒక పరశువేది !
అది -
మనసు 'సత్తు'ను చిత్తుచేసి
మేలిమి వన్నెలతో
మాలిమి చేసి నడిపిస్తుంది !!

# ఆరు

మానవారణ్యంలో బోనాలకు
పచ్చనాకుల ఆనవాలేది...?
బినామీ పేర్లే అన్నీ...!
వనం యావత్తూ అనార్తవమే!

తరుక్కుపోతున్న గుండెని
చెరుగ్గడల మిషన్లో పిండితే
రొడ్డు పులుపు, గొడ్డు కారం...
'తీపు' తప్ప 'తీపి' లేదు.

కృత్రిమ నవ్వులు రంగరించిన
నల్లరేగడి నేలమీద
ప్లాస్టిక్కు మొక్కలు
పుల్లని రసాలనే ప్రసారిస్తాయి.
పులుపు కతలే అన్నీ,
కారం కావ్యాలే అన్నీ,

అణిగిన ఆశల "పిప్పి"లోంచి
తేమని ఏమని ఏరగలం?

త్రాచుల్ని కడుపులో దాచే
నీచుల నిఘంటువులో
'పీచు' తప్ప 'నార' ఉండదు.

పొగలు కమ్ముకున్న కళ్లలో
సెగలు చిమ్ముతున్న గుండెలో
వగలు వరదలెత్తిన మెదడులో
రసాలు నీరసాలే! నీరస సస్యకాలే!

అడవు లెత్తుకెళ్ళే 'పాపి'కీ
ఇసుక పిసికి తినే 'మోపి'కీ
ఉగాదులెందుకు...?
ఉషస్సులెందుకు...?

మనసులో ఉగాదులుంటే
మోడున చేతలు చిగురిస్తాయి
దేహం నలుమూలలా
కోయిలలు కుహూకరిస్తాయి
ఒక్క ఉగాదే
మనసును కవితతో తడపగలదు
ఒక్క ఉగాదే
మనసును ఆనందంగా మలచ గలదు...
ఒక్క ఉగాదే
ఆశల గాదెను ఆశయాలతో నింప గలదు...

గుండె గదుల్లో విస్తరించిన
నరాల పట్టాలమీద పరిగెత్తే
వరాల బండి... మనసు!

సెలయేళ్ళ లోంచి, చిరుగాలి లోంచి
ఘన శంఖారావం లోంచి
జనగణాలను నడిపించే
జాతీయగీతం - మనసు !

అంతర్ముఖీనంగా ప్రవహించి చూస్తే
నిర్మలంగా కనిపించే సరసు... మనసు!

నీటి చుక్కలు
ఆవిరయ్యాయని వగపు దేనికీ?
మనసు-మనసు పడితే
వాన చినుకులు వరద నాట్యం చేస్తాయి!
తిండి గింజలు
నేలపాలయ్యాయని వగర్పు దేనికి?
మనసు-మనసు పెడితే
బంగారం పంటలు సంబరం చేస్తాయి!

ఊపిరి వదిలినప్పుడే
కొత్తగాలి పీల్చుకుంటుంది ప్రాణం...!
చీకటి చిదిమినప్పుడే
వేకువ రేకులు విచ్చుకుంటుంది లోకం...!

చీకటి చట్టం కళ్ళురిమితే
వెన్నెల గడ్డిపరకలే జయిస్తాయి!
ఎడారి కంసుడు కత్తి దూస్తే
ఒయాసిస్సు శిశువులే పూజలందుతాయి-
పంచభూతాలను పంచనామా చేసి,
అంచనాలను వంచించి,
ఆకాశపు టంచులను కోసి,
అగ్రగణ్యులు
జేబులో పెట్టుకు తిరిగినా
సామాన్యులు పాడే శాంతిగేయాలే
గాయాలు మాపుతాయి!

పిడికిట్లో పడి ఉన్న ప్రాణి
పిడికిలెత్తి నిలబడతాడు
తలను వంచి మొక్కిన బానిస
తల ఎత్తి అడుగుతాడు-

వేయి వెలుగుల తారల్ని
రేకులుగా విచ్చుకున్నవాడు
చేదు నిజాల పొద్దు పొడుపును
పాలవెల్లిగా పరచుకున్నవాడు

కరిగిన గుండెతో
పగిలిన గుండెని అతికించగలడు!
అగ్ని పుష్పాలతో
శాంతి బీజాలను మొలకించగలడు...
నదీ నదాలను తనలో కలుపుకుని
జలాశయాలకు చేతనత్వం నింపుకుని
సముద్రాలను చాపలా చుట్టగలడు...
మహా వృక్షాలను
సమాధులపై నిలపగలడు...
వంటికి అంటిన సంకెళ్ళను
మింటికి ఎగరేయగలడు...
కోటలు దాటిన నినాదాలను
చేతలుగా నిరూపించగలడు...
వాడు...పువ్వు మారాజు!
తలక్రిందులుగా వ్రేలాడదీసినా
ఎర్రెర్రగా చూస్తాడు!

వాడు...జ్ఞానం పొందిన ఆత్మజ్ఞాని!
బానిసలను బతిగించగల మౌని!

ఏ కొండ నెక్కి
సూర్యుడు లోకాన్ని పొడుస్తాడో
ఆ కొండపైనే ఆపన్నులు
రక్తపతాక నెగరేస్తారు!
కురుసేనలు తలలు తెగి
చండమారుతంలో సుడులెత్తి పోతారు!

జెండాని పట్టిన వాడికే జయం...!
జెండాని నమ్మినవాడికే శ్రేయం...!
జెండాయై ఎగిరేవాడికే ఆధిక్యం...!

ప్రతిచెట్టూ
ఎగరేసిన జెండాయే!
ప్రతి జెండా
పసిడి మనసుకు ప్రతీక...

దూరాన్ని దారంతో కొలిచేది...మనసు!
కాలాన్ని భారంతో తూచేది...మనసు!!
ఎదిగిన ఎత్తుని ఆదర్శంతో భాగించి
శేషం లెక్కగట్టేది... మనసు!

ప్రతీ చెట్టూ ఎగరేసిన జెండాయే,
మందస్మిత హరిత సంస్కృతి
తియ్యందనానికి ప్రతీక !

ప్రతీ చెట్టూ ఎగరేసిన జెండాయే,
పరిమళ భరిత సూర్యోదయానికి
తేజో విరాజిత జ్ఞాపిక...!

చిగుళ్ళు ఎర్రగా
పూలు తెల్లగా
ఆకులు పచ్చగా...
ఆత్మబలానికి సంకేతం...జెండా
వీరంగా...ధీరంగా... శౌర్యంగా

చెట్టులో ప్రతిబింబాన్ని చూసుకుని
మురిసి పోయే సూరీడు,
జెండా మధ్యన ధర్మచక్రమే!
తిరంగ...స్థిరంగా, ఈ 'తరం'గా

చెట్టు పాడే కట్టుపాట
లయ తరంగాంతరంగానుభవం!
ఊరంతటికి తానొక్కటై కావలి కాస్తూ
నిజంగా, చిరంగా...
హృదంతరంగానురాగం!

చెట్టుకు ఆవలి వైపు
సూరీడు తెలుపు 'మెరిపెం'గా...
చెట్టుకు ఈవలి వైపు
ఆకుల పచ్చ అచ్చ స్వచ్ఛంగా...
చెట్టు చుట్టూరా
ఎర్రని సందె వెలుగు
తేజరిల్లిన తేజంగా...

జన్మభూమిలో వ్రేళ్ళూనుకుని
తలెత్తి నిలబడిన గర్వం దానిది...!
జన హృదయంలో
చీకటిని చుట్టచుట్టి ఎగరేసే
చండమారుతం దానిది...
స్వచ్ఛంద భారతం దానిది...!
చేతనత్వం నింపుకున్న
మనసు దానిది...!
పోరాట తత్వం పెంచుకున్న
జాగృతి దానిది...!

ప్రతి చెట్టూ
ఎగరేసిన జెండాయే,
ప్రతి జెండా
నిలదీసే దండాయే!

చెట్టునంటి పాకుతూ పెరిగిన లత
జెండా తాడులా
ఆసరా అసలు లక్ష్యం...
పూలూ పళ్ళూ
చెట్టుతల్లిని ఆశ్రయించిన
జాతులూ భాషలు!
కొమ్మలు రెమ్మలు
చెట్టుతల్లి విస్తరించిన
జాతీయాలు, దేశీయాలు!
పుల్ల కుసుమిత
ద్రుమదళ శోభితాలు
వందేమాతరాలు!

సొంపారే శౌర్యాలను నింపుకుని
పెంపారిన గరిమను ఎంచుకుని
మనసు ఆత్రంగా చూస్తోంది...
ప్రశ్నించే మనిషి ఉనికి కోసం...
నిలదీసే పలుకుల వినికి కోసం...

'ఆశ తరగని ఆస్తి'ని
అందించింది మనసు...!
'ఆర్తికి వెరవని రీతి'ని
ప్రబోధించింది మనసు...!
మనుషుల్లారా... లెండి!
జీవధనస్సుల్లారా...రండి!!
మానవుల్లారా ...లెండి!
మహిమానుల్లారా ...రండి!!

ఆత్రంగా చూసింది మనసు...
మానులా నిల్చున్న
మానవుల వంక
భయభ్రాంతమై వెదికింది...
రుద్రరూపాన్ని పొందినా
ఉగ్ర శాపాన్ని పలకరేమని...?
పాద ముద్రల మీద
దారి గమ్యం వ్రాయరేమని...?

వ్రాయటానికి బాష
భాషించటానికి వ్రాత
భాషావ్రాతలే
చరిత్రకు దారిదీపాలు

చిన్నారి మొక్కలో
చిగురుగేయాలెక్కడివి?
సన్నాయి పూవులో
సరిగమలెక్కడివి?
మంటి నుండి మింటికెగిసే
మరుత్తరంగ నాదాలెక్కడివి...?
సాలోచనగా చూసింది మనసు...

పాటైనా మాటైనా భాషే ప్రధానం!
నడతైనా నడకైనా భాషే విధానం!
గర్భస్థ జీవితం నుండి
సమాధిస్థ మరణం వరకూ
భాష-
తరం తరంతో కలిపే
వర్ణమాల...!
భాష-
జనం జనంతో కలిపే
గుణకారం ...!
భాష -
మనం మనంగా నిలిపే
నిత్య బహువచనం...!

భాషించటం నేర్చాడు మనిషి....
భాషను కూర్చాడు మనిషి...
దీనులకు
బాసలు చేశాడు మనిషి...

"లోకమంతా పూవై పూస్తే
ముల్లునై పుట్టి, మల్లునై నిలిచి
పువ్వును కాపాడుకుంటానని!"
"దేశమంతా మహా వృక్షమై ఫలిస్తే,
కంచెగా నిలిచి, బాంచనై పెంచి
పండును రక్షించుకుంటానని!"
అది - లోకం నుదుట
జీవుడు వ్రాసిన భాష!

"మనుషులంతా
ఎగరేసిన జెండాలై నినదిస్తే
కవితగా ఎదిగి చేతనత్వం పొదిగి
దేశాన్ని నిలుపుకుంటానని !"

"మనుషులంతా
మహా సాగరమై అలలిస్తే
మేఘ రాశినై ఎగిరి వానచుక్కనై కరిగి
పంటచేనును పచ్చజేస్తానని !"

ఏ కంటి 'వింటినారి' సంధించిందని
నిర్మల తటాకాల్లో నిద్రపోయే సముద్రాలు
పొంగిపొంగి అంగలారుస్తున్నాయి...?

ఏ మింటి ఇంటి 'నారి' ముగ్గులేసిందని
గంగిరెద్దుల రంకెల సంబరాలు
గజ్జెకట్టి గంతులేస్తున్నాయి...?

ఏ కొండనెక్కి
సూర్యుడు లోకాన్ని పొడుస్తున్నాడో,

ఆ కొండపైనే
ఆపన్నులు రక్తపతాక నెగరేస్తారు...!
ఆ బండపైనే
కురుసేనలు తమలో తామే
తలలు తుంచుకు విసురుకుంటారు...!
చండమారుత గుండంలో
తమను తామే
సుడులు చుట్టుకుంటారు

"ఉరి"కి నడుస్తుంది
మురికినీరు చీకటి చేదుగుర్తుగా!
ఉరికురికి నడుస్తుంది
వరిపైరు జీవులప్రతినిధిగా!

సంతోషంతో పొంగిపొర్లింది మనసు
ఆకాంక్షల నదీతీరాన!
సంబరంగా చిందు లేసింది మనసు
ఆశయాల కొండకొనపైన!

ఇది మబ్బులూ మబ్బులూ
మిథునించి ప్రసవించిన
పిడుగు పాపాయి కేరింత...

ఇది కొమ్మలూ కొమ్మలూ
రాపిడించి ఘోషించిన
నిప్పు నాలుకల శబ్దజాలం...
ఇది నేల నీరు
మమేకమై గర్జించిన

వర్షనాద నినాదం...
ఇది జీవం భావం
కరుణించి వరమిచ్చిన
వృక్షజాల సంకేతం...

ఇది ఏరూ ఊరూ
సాధించి సాగించిన
నాగరికతా సందోహం...
ఇది ఏ గర్భస్థ శిశువో
గీ పెట్టిన ఓంకారం!
ఇది ఏ బాల బానిసో
ప్రవచించిన అర్థశాస్త్రం!
ఇది అగ్ని సముద్రం!!

మారాకు వేసి, మారాము మానేసి
మొక్క నింగి నడిగింది...
తనను లాలించి పాలించే
తోటమాలి మేటి ప్రేమ కోసం....

అలల నెగరేసి, అలక వదిలేసి
నీరు నేలకు వందనాలిచ్చి
గుంజీలు తీసింది...
తనను తోడించి పాడించే
కర్షకుడి హర్షధ్వనుల కోసం...

మర్త్యలోకం చుట్టూ మసలు కున్నాయి
కామధేనువులు, కల్పవృక్షాలు!
చావును చిదిమే జీవన జ్యోతిర్లింగాలు!

మరణ సంకేతాల చుట్టూ
కమ్ముకున్నాయి...
అమృత బిందువులు,
అనంత సింధువులు,
బతుకును బలపరిచే,
పావన గంగా జలాలు!

మనో గుణాలు మూడూ
ముచ్చటగా ఎగిరాయి
మువ్వన్నెల జెండాగా!
"సత్వం"
కళ్ళురిమిందంటే
నరాలలో తరాలుగా ప్రవహిస్తోన్న
విద్యుత్తరంగాలు ఉద్రేకిస్తాయి!

"రజం"
రాజుకుందంటే
రక్త సముద్రంలో యుగాలుగా నిద్రిస్తోన్న
ఆటుపోట్లు ఉప్పెనై నిలుస్తాయి!

"తమస్సు"
తలచుకుందంటే
మనసు పొరల్లో ఆటపట్టై
చెలరేగుతున్న
బానిసబంధాలు పటాపంచలౌతాయి!

అజాగళస్తనం కాదు
మనోబలం!

అందరాని అంటరాని
బ్రహ్మపదార్థం కాదు
మనసు తేజస్సు!

"మా నిషాద" నుండి
"మహా ప్రస్థానం" దాకా...
వేదాల నుండి
సాపేక్ష వాదాలదాకా...
రాతి యుగాల యాగాలనుండి
రోదసి కాలయానాల దాకా...
నిరంతరంగా సాగిన
మూడు కాలాల చక్రాన్ని
మూడుగుణాల జెండాలో
ధర్మచక్రంగా ముద్రించి
కర్మవాదనను కడిగి
ధర్మపాలనను ప్రతిష్టిస్తుంది!
లోకచేతనని ప్రతిఫలిస్తుంది!!

బానిసల్ని బలిచేస్తే
లోకంలో తిరుగుబాటు ఆగదు!
పాదుషాల్ని ప్రోత్సహిస్తే
లోకానికి జరుగుబాటు సాగదు!

మనసుకు తెలుసు,
బలుపుకూ వాపుకూ తేడా!
ప్రకోపానికీ ప్రలాపానికీ వార!!

"సమానం ధనం" తన నినాదం
"సమానం జనం" తన విధానం

తేట తెలుగులో
అరుణకిరణం ప్రతిస్పందిస్తుంది!
తోట పాటలో
ఆరుణ్యం, కారుణ్యం వికసిస్తుంది!

జన జాగృతి శోకానికి నిష్కృతి!
శుభం అని ముగిసే సత్కృతి



# "కాంతిస్వప్న"

# అమృత బిందువుల పావన గంగాజలం

- ఆవంత్స సోమసుందర్

ఆధునిక తెలుగు కవిత్వానికి ఎనభైల దశకం ఒక స్థిరతని ప్రసాదించింది; ఒక సంచలనాత్మక శక్తిని చేకూర్చింది. ఈ దశకంలో ఎన్నో ప్రముఖ కవితా సంపుటాలు వచ్చాయి. అసంఖ్యాక ఖండకవితాసంపుటాలలో కొద్దిగానైనా సంపూర్ణ కావ్యాలు వెలువడక పోలేదు. అయితే అలాంటి ఉత్తమ గ్రంథాలను దీక్షగానూ, దిదృక్షతోనూ అధ్యయనంచేసి, దక్షతతో వ్యాఖ్యానించగల విమర్శకులే కరవవుతున్నారు. కవులా ఎవరికివారు తమ శిబిరాన్ని సంరక్షించుకోవడంలోనే నిమగ్నమైపోతున్నారు.

"కవిఃకరోతి పద్యాని లాలయ ద్యుత్తమోచనం
తరుః ప్రసూతైఃపుష్పాణి మరుద్వహత సౌరభం"

అని ఎప్పుడో ఒక మహానుభావుడు ఉద్ఘాటించాడు. కానీ, ఉత్తమజనులూ, మరుద్వీచికలూ మౌనం వహిస్తే కావ్యాలూ సౌరభాలూ నిరర్ధకాలే!

ఎనబైలలో వెలువడిన అరుదైన సంపూర్ణ కావ్యం- 'కాంతిస్న్ప'. ఇది 1988 నవంబర్‌లో వెలువడింది. 'స్పందన సాహితీ సమాఖ్య - మచిలీపట్నంవారి ప్రచురణ. (1/8డెమ్మీ ఎనిమిది రూపాయలు) ఇది ఆరు ప్రకరణాలుగా విభక్తమైన allegory సంవిధానానికి సంబంధించిన కావ్యం. డా॥ జి.వి. పూర్ణచందు దీని కవి.

(Narrative description of a subject under guise of another suggestively similar nature) ఈ కావ్యం షడ్రుచులనూ ఆస్వాదంచేస్తూ ఆలోచనాత్మకంగా సాగిన అపురూప విజయం.

వర్తమాన జీవితం అయాచితంగానే ప్రపంచ పౌరసత్వాన్ని సముపార్జించుకుంటోంది. నవనాగరకతా ప్రపంచంలో భాగస్వాములుగా మనం ఆధునిక వైజ్ఞానిక సాంకేతిక సదుపాయాలను ఆశ్లేషించుకుంటున్నాం. సాంకేతిక ప్రభావం ఆధునిక కళలపైన కూడా విశ్లేషంగా ప్రసరిస్తోంది. కొయ్య బొమ్మలను కోమలులుగా మెరిపిస్తోంది. కాని, కవిత్వకళ దగ్గర మాత్రం ఈ పప్పులేమీ ఉడకవు. కవిత్వం 'పదార్థ' సంపుటిపై ఆధారపడే అక్షరకళ!

భారతదేశంవంటి బృహత్తరదేశంలో, సంకీర్ణ ప్రాకృతిక శక్తుల సమ్మేళనంలో, భౌగోళిక స్థితిగతుల వైవిధ్యంలో మనమింకా గ్రామీణ జీవితంతోగాని, ప్రకృతీ అనుబంధంతోగాని పూర్తిగా తెగతెంపులు చేసుకోలేక పోతున్నాం. మనలో ప్రతి ఒక్కడి తల్లివేరూ పల్లెపట్టునే గట్టిగా పట్టుకొని వుంది. దాన్ని విడువలేరు.

అందువల్లనే - ఏదో ఒక పాశ్చాత్య సాహిత్యంలో తలెత్తే వెర్రివాదాన్ని తెచ్చి తెలుగుమాటలకు అంటుకట్టదలిస్తే - ఆ విచిత్రజీవిని మన నైసర్గిక పరిస్థితులు తిరస్కరిస్తాయి.

కాంతిస్వప్న కావ్యారంభంచేస్తూ పూర్ణచంద్ యిలా అంటున్నాడు: "వెలుగుకలలతో అల్లుకున్న రంగుల సంచీలో దృశ్యాలెన్నో నింపుకొని ప్రకృతి" ఈ అభివ్యక్తిలో ఒక చమత్కారం ఉంది. ఒక యదార్థ విషయాన్ని కవిత్వీకరించడం ఒక్కటే కాదు, మన మనోనేత్రాల ఎదుట ఒక సుందర చిత్రాన్ని ఆయత్తం చేయడమూ ఉంది.

నేటి నాగరిక స్త్రీలు రంగురంగుల ప్లాస్టిక్ తీవలతో అల్లుకున్న సంచీలలో, స్వయంగా విపణి వీధులనుంచి తమకు కావలసిన సరుకులు ఎన్నుకొని నింపుకుంటున్నారు. ఈ అభివ్యక్తిలో ఒక మనోహర వాతావరణం పాఠక హృదయంలో సంసిద్ధమై, ఈ కావ్యాత్మకు ఆ వనిత ప్రతీకగా ప్రతిష్ఠితమైంది. ఆ వనిత సామాజిక హృదయంగా సంకేతించబడింది. ఆమె నవనాగరకమైనప్పటికీ చిరంతన బంధాలు నిర్నిబోధకంగా కొనసాగుతూనే ఉన్నాయి. ప్రకృతి తన సౌందర్య దృశ్యాల్ని సేకరించుకుంటూ వెదజల్లుతూనే వుంది. పువ్వులు

విచ్చుకుంటున్నాయి. సౌరభాల్నీ సౌందర్యాల్నీ ఏకదేశంగా ప్రసరిస్తూ రాలిపోతున్నాయి. అయినా ఆ క్షణాలనే ప్రకృతి మధురీకృత శాశ్వత కల్పాలుగా మారుస్తోంది. ఉన్నతంగా, ఠీవిగా నిలిచిన కొండలూ, దీనంగా దిగులుగా ఒంగిపోయిన లోయలూ కాలనాదాన్ని అస్వాదిస్తూనే ఉన్నాయి. అహర్నిశం ఆశాపారవశ్యంతో ప్రకృతి పులకిస్తూనేవుంది.

"చీకటిలో వెల్తురుచిమ్మే నక్షత్రశకలాల వెంట నవజీవాన్ని సృజించాలని" వర్తమాన మేథ నిరంతరాయంగా ఆరాటపడుతోంది. కాని మన వేకువలు - అనేక మాలిన్యాల పొగమంచులతో దృశ్యాలను అదృశ్య మొనరిస్తున్నాయి. చీకటి సుడిగుండాలు సృష్టిస్తున్నాయి. గొంతు పెగలక చేతులెత్తి రమ్మని సైగలుచేసే బాధితుల్లా మనకి కనిపించడమే కాదు. డగ్గుత్తికతో వెలువరించేవారి ఆర్తనాదాలు మన వీనులకు చేరనే చేరవు. సమాజం ఒక నిశ్చలనచిత్రంగా ప్రత్యక్షమవుతోంది. మన కన్నులకు కమ్మిన కావిరులవలన ఆ చిత్రంలోని రూపురేఖల వివరాలు మృగ్యమైపోతున్నాయి. మానవుల నడుమ ఒక అజ్ఞానబంధం బిగిసిపోతోంది.

కవి అంటారు కదా... "నేల తనచుట్టూ పరిభ్రమిస్తోందని సూర్యుడికి తెలుసా? సూర్యుడు తనను వెంట త్రిప్పుతున్నాడని భూమికి తెలుసా?" నిజానికి రెండూ జ్ఞాతశక్తులు కాదు. అజ్ఞాన బంధాలు. అజ్ఞాతాన్ని జ్ఞాతంగా మార్చడానికే మానవమేధ; చిరంతన పరిశోధనలలో పరీక్షిన్నమవుతోంది! సూర్యుడు గాని, భూమిగాని రెండూ నిజానికి జడశక్తులే! కానీ, ఒక ప్రాకృతిక ధర్మసూత్రంతో సంచలనశక్తిని సాధించగలిగాయి. అచరాలు చరాలుగా మారుతున్నాయి. అగోచరాలు గోచరాలవుతున్నాయి. పదార్థం శక్తిగా పరిణమిస్తోంది. శక్తికి రూపురేఖలు అమరుతున్నాయి.

అప్పుడు ద్వంద్వాలన్నీ అంతరించి "ఏకమేవా ద్వితీయం!" అనే జ్ఞానసిద్ధాంతం ఆవిర్భవిస్తుంది. జడమయ శరీరంతో సంచలనాత్మక మనస్సుకు అవినాభావ సంబంధం ఉన్నప్పుడే శరీరి శీరిగా, కారిగా మారుతున్నాడు. సజీవ చైతన్యం అందుకు కారకం అవుతుంది.

మనస్సు అంతర్ధానమైతే శరీరం శవప్రాయమే! కట్టెవలె తిరిగి

జడమైపోతుంది. సుందరారోగ్యమయ శరీరాన్ని విడిచి దూరమైతే... మనసు దయ్యమై గాలిలో ఈదులాడుతుంది. రెండూ తిరస్కరణీయాలే! పార్థివజీవచైతన్యాల అవిభాజ్యమూర్తిగా మనిషి తన లోకాన్ని తన అంతరంగాన్నీ అవలోకించడం ద్వారా క్రాంతదర్శిగా మారగలుగుతాడు. సకల రక్తమాంస గంధిలమైన నిఖిల జనసామ్యం" దర్శనమీయ గలుగుతుంది.

మానవుని అంతరంగం - చిరకాలంగా నిరంతర జాగరూకమై, యిరుకుదారులెన్నిటినుంచో తన ఆలోచనా యాత్ర సాగించింది. ప్రకృతి సహజంగానే సృష్టిని తన బాహ్యాభివ్యక్తిగా వికసింపచేసుకుంది. పుడమి పాదులలో జీవాంకురాలను జాగృతంచేస్తూనే ఉంది. పసిడి ఊహలుసారించి, జీవనదీపాన్ని వెలిగించుకుంది. ఇంత మనోజ్ఞ సశక్తప్రకృతి మానవుని సృజించుకోలేకపోతే ఎంత వ్యర్థపటలమై పోయేదో!?

అదృష్టవశాత్తూ ప్రకృతి, మానవ స్వరూపాన్ని ప్రోదిచేసినదాదిగా, స్వాప్నిక స్వభావంతోనే తన దివ్యశక్తిని ద్విగుణీకరించుకుంటూ పురోగమించింది. అణువంత స్వప్నం మనసులో పొటమరించి విశ్వరూపమెత్తింది. ఆలోచనకీ, ఆచరణకీ నడుమ సాపేక్ష సమిష్టిని నెలకొల్పుకుంది. జ్ఞానాన్నీ, భావనాశక్తినీ ఉష్ణంగా, కాంతిగా అమర్చుకుంది. అందుకే కవి ఇలా అంటున్నాడు: "అక్షయరోదసిని అమ్మ ఒడి అనుకొని కేరింతలాడే జీవులు ఎలా నేర్చుకున్నాయో గోళాల గడపలు దాటే అడుగులు!"

నిజమేమరి; అంత చిరుపాదం ఇంత నిరవధిక యాత్ర ఎలా సాధించిందో? సృష్టిపాదులోంచి అంకురించిన జ్ఞానజ్యోతి కనిపించిన కాంతులన్నిటినీ ఆహారంగా గ్రహించింది. తన మనసురేయి కంటున్న కలలను ప్రత్యూషలలో ఆకృతులుగా మలుచుకుంటోంది. పారార్థికమైన విలువలు నిలుపుకుంటూ పురోగమించింది.

ఏరుగా పారిన చరిత్రకు అప్పుడప్పుడు మాయకాలం అడ్డుకట్టలు వేయకపోలేదు; కాని కలుపుమొక్కల్ని పరిమార్చుకుంటూ - మేలైన సస్యాల్ని వశ్యం చేసుకుంటూనే వుంది. ఇలా సాగే చింతనామయరస వాతావరణంతో

మొదటి ప్రకరణం ముగుస్తుంది. పరుగెత్తే నదిలో ప్రవహించే సంచలన శక్తికి భూమి జోహారు లర్పిస్తుంది.

అయితే ఇక్కడే ఒక్కమాట చెప్పుకోవాలి : "The importance of a poet quality or quantity of his work, but on its power of radiation" అంటాడు ఫ్రాన్సిస్ స్కార్ట్ (See Anden and after) అయితే ఈ రేడియేషన్‌ను ఎలా పట్టుకోగలుగుతాం? ఒక కవి ఎంతో కష్టపడి పుస్తకం ముద్రించి అందిస్తే అందుకొని అందలి కాంతివలయంలో పాఠకులు కాంతితునకలు ఏరుకోవాలి. ప్రపంచంలో రసజ్ఞులైన పాఠకులకు సైతం – ఏవి చలివేంద్రాలో, ఏవి పానశాలలో పోల్చుకోలేని అవజ్ఞత ఘనీభవిస్తోంది. చివరికి ఏ 'చెట్టు' నీడనో పాంథశాలగా భ్రమించి సాగిపోవలసిన దుర్గతి ఏర్పడుతుంది. మన విమర్శకులు గుడ్డిగా తరుముకుంటున్నారే తప్ప పాఠకులకు మార్గదర్శకులు కావడంలేదు. ఎప్పుడో పోతన్నగారు చెప్పినట్లు – 'కాననివాని మాటగొని కాననివాడు సమస్త వస్తువుల్ కావని భంగి' గుడిసుళ్ళు పడుతున్నారు.

ముప్పయ్యేళ్ళ క్రితం వరకూ మనగ్రామాలలో ఇత్తడి దీపంచెట్లు ఉండేవి. వాటి పత్రాలే ప్రమిదలుగా రూపొందించబడేవి. చెట్టునిండా ఒత్తులు నూనె నింపి దీపాలు వెలిగించేవారు. భజనపరుల బృందం దాని చుట్టూ తిరుగుతూ చిడతలు, అడుగులూ వాయించుకుంటూ గుండ్రంగా తిరిగేవారు. ఒకే వాక్యాన్ని పదే పదే ఉచ్చరించేవారు. మచ్చుకి– "ఏదిరా లక్ష్మణ సీతా – పర్ణశాలలో లేదెందుచేత?" ఎంతసేపు గడిచినా ఈ వాక్యం మారేది కాదు.

సరిగ్గా అలాగే జరుగుతోంది. నేడు కొందరు కవితా విమర్శకులు పీఠాధిపతులుగా మారారు. తమ చుట్టూ పిల్లకవుల భజన బృందాన్ని తిప్పుకుంటున్నారు. తమ దయాదీపకాంతులు వారిమీదే ప్రసరింపజేస్తున్నారు. ఇలాంటివారి ముడిరాతల్లో చేబియ్యం తప్ప పక్వాహారం లభించడంలేదు. నిష్పక్షపాత పరిశీలన ముందే కనిపించదు. అందువల్లనే ఎనభై దశకంలో వెలువడిన "కాంతిస్వప్న" వంటి ఉత్తమ కావ్యాలపై సమీక్షలే కరువయ్యాయి. విస్మృతిపాలవుతున్నాయి.

ఆధునిక కవిత్వం సాధిస్తున్న విజయాలకు ఇలాంటి అరచూపుల

కొరకొరలూ, దురదృష్టపు విమర్శలూ శాపాలుగా మారుతున్నాయి.

రెండో ప్రకరణంలో మానవుని అంతశ్చేతన అవిరళ యాత్ర నిమగ్నం కావడం, శ్రమద్వారా పంపదనీ, కళల్నీ సృజించడం, సామాజిక పురోగమన సమష్టిగా కృషి సల్పడమూ వర్ణితమయ్యాయి. ఈ త్రిగుణాలే మానవజాతి అభ్యున్నతికి ప్రధాన ఆధారాలు. ఆకలీ ఆవేశం- పరితృప్తీ ఆనందం ఈ నాలుగూ మానవుని శ్రమైక జీవనాన్ని నిర్ధారిస్తున్నాయి.

"సమాధానాల నల్లేరుపైన
సృష్టి అసలు రహస్యాన్ని...
సంకోచంలో సంకేతం
అక్షరాల్లో ఆశ్చర్యార్థకాల్లా "
- ఇదీ అనంతంగా సాగే సంశయ చక్రం

ఆ చక్రానికి క్రకతదంతాలున్నాయి. అయినా మనిషి ఎంత శ్రమకైనా ఓర్చి ఆ చక్రాన్ని త్రిప్పక మానడు. ముందుకు సాగకనూ మానడు. ఆ చక్రక్రమంనుంచే భువనానికి విజయాలు అనుభూతులయ్యాయి.

ఈ భావాన్నే మహాకవి పాబ్లోనెరూడా తన 'మచ్చూపిచ్చు' అనే దీర్ఘ కావ్యంలో ఇలా వివరించాడు.

Though a confusion of splendour
Though a night made stone let me plunge my hand
and move to beat in me a bird
held for a Thousand Years
The old and unremembered human heart!

నిరంతర మానవ అన్వేషణ వర్ణించాడు. (పు. 117 Selected poems)

మానవ హృదయం ఎన్నో వాసనలతో సమ్మిళితమై ఉంటుంది. ఎన్నో లాంఛనాలతో భావభరమై సాగుతుంది. (Allegory అంటే Emblem అనికూడా అర్థం ఉంది. దీనికి శ్రీ మహీధర రామమోహనరావు "లాంఛనం" అని అనువదించడం స్వీకార యోగ్యమైంది. మా- 'తుమ్మల సాహిత్యం పు. 245). ఇన్నివేల వత్సరాలు గడిచినా మానవ చరిత్ర పరిపక్వం కాలేదు. దానికి కారణం అవిరళంగా రెండడుగులు ముందుకు వేస్తే ఏవో ప్రలోభాలతో నాలుగడుగులు

వెనక్కి వేయడమే! మానవుల సమస్యలన్నీ పరిష్కృతాలూకావు; అయితేనేం? యాత్ర విరమించవలసినది కాదు. కంకణ విసర్జనకు ఎన్నడూ కాలం పిలుపివ్వదు. శ్రమనుంచే సర్వసత్ఫలితాలూ జనిస్తాయి– అనే సత్యాన్ని ఎంతో చమత్కారంగా "చెమ్మగిలిన చెమటలో రత్నాల విత్తనాలు ఫలిస్తాయి" అంటాడు పూర్ణచంద్.

వెలుతురులో వాదాన్ని వెదజల్లే తంతులున్నాయి. సందేహాల సమాధిని చీల్చుకుంటూ సమాధానాల వటవృక్షాలు విస్తరిస్తాయి. రాపాడే నరుల నరాలలో పారాడేనదులు ఉద్భూతమవుతున్నాయి.

పూర్ణచంద్ కావ్యంలో ఒక్క వాక్యమైనా పదచిత్ర విరహితంగా, ఫ్లాట్‌గా ప్రయుక్తం చేయడం కన్పించదు. ప్రొఫెసర్ బౌరా చెప్పినట్లు– కవిత్వాన్ని కాలక్రిమి దష్టం కాకుండా కాపాడే నాఫ్తలీను ఉండలు పదచిత్రాలే! కవిత్వానికి మన్నికనీ, దరుజునీ, ఆయుర్వృద్ధినీ సమకూర్చే రక్షాకవచం సంవిధానమే. ఈ ప్రాణధాతువులు రెండింటినీ ఎంతో కౌశలంతో ప్రయోగించి, ఉపరితల వాస్తవికతను చీల్చుకుంటూ అంతరాంతరాల లోతుల్ని అవలీలగా స్పర్శిస్తాడు.

మూడో ప్రకరణలో మానవుని మనస్సు సాధించిన శోభ–సహస్ర కిరణ తోరణాన్ని వెలార్చడం వివరించాడు. కవిత్వంలో శాస్త్రం వివరించాలన్న ఉబలాటం పైకొన్నప్పుడు ఆ కవిత్వమే పడగ విప్పుతుంది. ప్రబోధం అపారమైతే దుర్వాసనాభరితమవుతుంది. ఆ ప్రమాదం ఇలాంటి కావ్యాలకు ఎక్కడో ఒకచోటయినా తప్పదు. సి.నా.రె రచించిన భూమికలోగాని, విశ్వంభరలోగాని ఈ దోషం జాగరూకతగల పాఠకుల పరిశీలనకు అందకపోదు; దోషాలమాటకేం గాని, గుణాలన్నిటినీ పట్టి చూపాలంటేనే ఈ కావ్యంకన్న రెట్టింపు విమర్శ గ్రంథం రాయాల్సి వుంటుంది. "పగ పట్టిన పొగమంచు", "కోటి గుండెల ఆర్తనాదాన్ని తోటి గుండెల్లో వెలిగించడం", "బానిసత్వంలో 'మందమతి' " వంటి పదచిత్రాలు కావ్యంనిండా కోకొల్లలుగా లభిస్తాయి. సహృదయ హృదయాలను అలరిస్తాయి. ప్రతిపాదమూ ఆపి ఆలోచింపజేస్తుంది. "కరిగించే పాటలో కరుణించే చరణం మనసు" అని అద్భుతారహంగా అనగల చేవ ఉత్తమభావుకునికి, కవితాపూర్ణ సంస్కారికీ మాత్రమే సాధ్యం. వెలుతురుతోను ఇరులతోనూ సమానంగా బంధుత్వం

నెరపే మనస్సు ద్వంద్వాత్మకతను ఈ ప్రకరణం చక్కగా వర్ణించింది.

నాలుగో ప్రకరణంలో 'అంతరిక్షం రహదారిలో చక్కగా అలుముకొన్న వటవృక్షంవంటి దంటాడు జాబిల్లిని" "వెలుగుటాకులతో గుడిసె కట్టుకొని కాంతిస్వప్నాలతో కడుపునింపుకుని" జీవితం ఎలా ప్రవర్ధమానమైందో హృద్యంగా వ్యక్తీకరిస్తాడు. కొండ గుహల జీవితం దండిమగల జీవితంగా మారింది. నాగరీకమై కాలాంతరాలను జయించపూనుకుంది. శిలలపై కలలను శిల్పాలుగా మలచుకుంది. మనిషి జీవితం పరాంకోటుల ప్రసవించింది.

కావ్య రచనా వ్యాగ్రతలో ఈ కవిబుద్ధి పాదరసంలా విస్తరిస్తుంది. పారదర్శకంగా పార్థివలోకాన్ని అనుశీలిస్తుంది. 'మురిపెంగా నవ్వే పంటల వెంట సాదరంగా సాగే నదుల పలకరింపుల కిలకిలలకు' కవి హృదయం సాగరమై విజృంభిస్తుంది. "విద్యుద్వలయం మధ్య విద్వత్తులేని పండిత ప్రకండుల కొయ్యకండల్ని" నిశిత బుద్ధితో దర్శించగలుగుతుంది. ఇలాంటి కొయ్యకండల పండిత వృషభులే మనకు భుజబలదర్పంతో సర్వత్రా దర్శనమిస్తున్నారు. వీరి బారిపడి గిలగిల లాడుతున్న తెలుగు సాహిత్య విమర్శను- చర్చనీయాంశాల దుస్తంత్రాలనుంచి భవగవంతుడొక్కడే రక్షించగలడు!

మనిషి అహమిక సంతృప్తి చెందనిదే అతని సృజనశక్తి ప్రవర్ధిల్లదు. ఈ ప్రాథమిక సత్యాన్ని విస్మరించి మనిషిని మూకలో కట్టడంవల్లనే ఎందరో వేత్తలు వెర్రి తీర్పులిచ్చారు. సమష్టి మానవజాతి ఎంతో నష్టపోయింది. అందుకే ఈ కవి ఇలా అంటున్నాడు: "వికసించే పువ్వుకు పరమళించే గంధం 'నేను'-" అనీ! "నేను లేని వెన్నెల అడవిలోకాచి ఆరిపోతుంది" అనీ ఎంతో హృద్యంగా వివరించాడు. మనసు లోగిలిలోని అన్ని కోణాలకూ జ్ఞాన కిరణాలూ స్మృతి రేఖలూ- వేకువ వెలుగుల్లా స్వేచ్ఛగా ప్రసరించాలి. అంతవరకూ లోకం పెదవులపై దరహాసం మొలకెత్తదనీ ఈకవి విశ్వసిస్తాడు.

ఐదో ప్రకరణంలో వేరువేరు తీరులలోకం అభివర్ణితమైంది. ఆహారాన్వేషణ దశలో మానవజాతి జంతుజాలం మాదిరిగానే బ్రతికేది.

ఆహారోత్పత్తి దశ ప్రారంభం కావడమే ఒక సామాజిక విప్లవం. కర్మనుంచి ఆలోచన. ఆలోచన నుంచి కర్మలో కౌశలమూ పెంపొందుతూ మానవమేథ నైశిత్యమందుకుంది. హస్తానికి నైపుణ్యం పెరిగింది. తదాదిగానే మానవజాతి - "కడుపు నిండితే కనురెప్పలపైన రవిచంద్రులు నిలవాలంటుంది!" అన్నస్థాయి కెదిగిందంటాడు కవి.

తాత్త్విక చింతనామయ కవితాధార భావుక హృదయాన్ని ఆద్యంతం ఆవిష్కరించగలగడం ఈ కావ్య విశిష్టత. లఘుకావ్యాలతో రక్తి కట్టించడంకన్న బృహత్కావ్యంతో రంజకతని ప్రోదిచేయగలగడం అసిధారావ్రతం. అట్టి కష్ట నిష్ఠూర మార్గాన్ని ఎన్నుకొని విజయం సాధించగలగడం ఆవశ్యం ప్రశంసా పాత్రమైన గుణమే! మరెందువల్లనో గత రెండేండ్లుగా ఈ కావ్యం గురించి సాధారణ సమీక్షలే అంతంత మాత్రమయ్యాయి. ఇది శోచనీయ స్థితి కాదా?

కవితారంగంలో సైతం- "భజనపరులకేల భయము?" అనే ధీమా స్థిరపడుతున్న దుర్మార్గం దాపురించింది. పత్రికారాజ్య భద్రాసనంపై కూర్చున్న ఏ దిష్టిబొమ్మకైనా దక్షిణలు, ప్రదక్షిణాలూ చెల్లిస్తుంటే తప్ప- ఏ పత్రికలోనూ ఒక మంచి కావ్యం గురించి ఒక సద్విమర్శ చోటుచేసుకోదు. పత్రికా అధికారం చేతిలో ఉంటే ఎంత కువిమర్శను దేశంపై రుద్దవచ్చునో మహానుభావుడు పురాణం సుబ్రహ్మణ్యశర్మ ఏనాడో రుజువు చేశాడు!

ఈ కవి అన్నట్లు- "గాంధీ గాడ్సేలు రెండు అంశలు లోకానికి!" నిజమే; గాంధీ వ్యతిరేకుల అక్రమ సంతానమే నేడు పల్లకీలెక్కి ఊరేగడం చూస్తూనే వున్నాం. "ఏ రాజసం కొవ్వెక్కి శాసించిందని జరుగుతోంది- జనాన్ని వెంట తిప్పుకు ధనం కులకడం?" అని ప్రశ్నించిన ఈ కవికి వర్తమాన సమీప ధనిక వర్గంలో జవాబు చెప్పే దమ్ము ఎవడికుంది? అందుకే ఈ ప్రకరణాన్ని ముగిస్తూ కవి ఒక సాహస హాసంతో విశ్వాస ప్రకటన ఇలా చేస్తున్నాడు. పువ్వులు జ్వాలలై ఆర్తుల గాథలై నిశ్చలంగా నిలిచింది చెట్టు! చుట్టూ ఓజస్సు! జ్వాలకు తోడై వీచింది ఎర్రగాలి. చేతనకు చేవై చెలరేగింది చిగురుటాకు" అని ఎంత గాంభీర్యమో భావన చేస్తే తెలుస్తుంది.

ఆరో ప్రకరణం కావ్యానికి మంగళాంతం పలికింది. కథగాని కథా సూచనగాని ఆధారంగా కావ్య ప్రణాళిక నిర్మాణం కాకుండా, కేవల తాత్త్విక విచికిత్సనే కావ్యేతివృత్తంగా స్వీకరించి నిర్వహించడంతో క్షణక్షణమూ ప్రమాదం ఎదరవుతూనే వుంటుంది. తాత్త్వికాంశ విపులీకరణం ఏ మాత్రం పెచ్చరిల్లినా కవిత్వానికి గ్రహణంపడుతుంది. కవితా పరిమళానికి వివశుడై కవి ప్రాణభూతమైన ఇతివృత్తాన్ని విస్మరిస్తే తాత్త్వికాంశం ప్రాణ రహితమవుతుంది. ఇలాంటి కావ్యాలకు కవే వక్త. ప్రదర్శకుడూ కావడంవల్ల అందందు స్వవచో వ్యాఘాతాలు దురాక్రమించవచ్చు. ఆడపాతడపా అంతర్ వైరుధ్యాలు ఎదురుకావచ్చు.

ఇలాంటి బాలారిష్టాలన్నీ గడచి కవి జాగృత హృదయం భాసిస్తే కావ్యం విజయం సాధించగలుగుతుంది. అందుకే కవిగా డాక్టర్ పూర్ణచంద్ నిజంగా అభినందనార్హుడే!

ఈ కావ్యానికి విపులమైన పీఠిక రచించిన డాక్టర్ సంజీవేవ్ పెద్దవారే! సందేహంలేదు. కాని వారు సాధారణంగా మాటలతో ఆటలాడుకుంటూంటారు. ఎందువల్లనో వారి భావుకత్వాన్ని చాపల్యం నీడలా వెన్నంటుతూంటుంది. ఉదాహరణకు–"వాక్యం తిరగేస్తే కావ్యం, కావ్యం తిరగేస్తే వాక్యం"వంటి విడ్డూరమైన సూక్తులలో ఏ మాత్రం భవ్యత గర్జితమవుతుంది? (చూ. చితీ–చింతకు రాసిన పీఠిక). ఈ కావ్యపీఠికలో సైతం పదఖేలవలు లేకపోలేదు.

ప్రతి మనిషీ కవికాదు... ప్రతికవీ మనిషే!" వంటి సూక్తుల మోజులోపడి కావ్య అంతస్సారాన్ని స్పర్శించలేకపోయారు. తాత్త్వికాంశాలను వ్యాఖ్యానించలేని స్థూలదృష్టినే ప్రదర్శించారు. కానీ, ఒక్క మంచి మాట అన్నారు. "కాంతి స్వప్నలోని కవితలన్నీ మిగతా కవుల ఎవరి కవితలతో పోలిక లేని విలక్షణ నిర్మాణాలు!" అని. కానీ, ఈ కావ్యంలోనివి విడి కవితలు కావు. ప్రకరణాలు మాత్రమే! విలక్షణత ఒక్కటే శ్లాఘాపాత్రమా అనే తర్కం ప్రారంభిస్తే చాలా రాద్ధాంతం సాగుతుంది. దాన్ని వదలి సంజీవదేవ్‌గారి మరో మంచిమాటతో తృప్తి చెందుతాము. "వ్యవహార సౌకర్యం నిమిత్తం ఈ కవిత్వాన్ని ఒక పేరుతో పిలవాలనుకుంటే 'లోకోత్తర కవిత' (Transcendantal Poetry) అనవచ్చు నన్నారు. ట్రాన్సెండెంటల్‌కు

లోకోత్తర అనే పదం ఎలా సమానార్థకమవుతుందో విజ్ఞులాలోచించాలి. దాని ప్రచారకులు భావాతీతధ్యానం అంటున్నారు దిక్కులేక! వ్యవహార సౌకర్యం నిమిత్తమైనా పొసగని పేరు పెట్టడం భావ్యమూకాదు, కవికి న్యాయమూ కాదు.

పూర్ణచంద్ నిస్సంశయంగా అభ్యుదయ కవి. ఆయనలో ఆ భాషధార పుష్కలంగా ఉంది. అరసం ఉద్యమ అభ్యున్నతికి నిరంతరం కృషి సలుపుతాడు. కనకనే పరిస్థితుల ఆంతరిక సంఘర్షణలోని గతి తర్కాన్ని చక్కగా అవగాహన చేసుకోగలిగాడు. కవితా పరిభాషలో అభివ్యక్తం చేయగలిగాడు. అంతవరకూ శోభోదర్కమే!

కవితాభివ్యక్తిలో పదచిత్ర సమాహారాన్నీ, పూర్వగాథా సంస్మరణనీ ఓహరిసాహరిగా ప్రదర్శించాడు. ఉపమారూపకాదు లెక్కడా భగ్నప్రతిమలు కాకుండా సంరక్షించుకున్నాడు. ఇంతకన్న ఏ విజయాన్ని మాత్రం కవినుంచి సహృదయుడాశించగలడు?

మరింత కవితా తపోదీక్షకు డాక్టర్ పూర్ణచంద్‌కు సమయమూ ధ్యానమూ లభించాలనీ, మరెన్నో ఉత్తమ కావ్యాలు విరచించాలనీ ఆశిస్తూ, అగ్రజకవిగా శుభాశంసలందిస్తాను.

*1990-నవంబరు5*

*ఆంధ్రభూమి దినపత్రిక 'కితాబు' శీర్షికన ప్రచురితం.*



పూర్ణచంద్ కవిత్వంలో వెంటాడే వాక్యాలు ఆలోచనీయంగా జాలువారుతాయి. 'లేనిది కావాలనటం ఆశ/ కావాల్సినది లేకపోవటం అమావాశ్య' అనగానే చూపు ఆగుతుంది, సాధారణ సూక్తిని కవితామయం చేయాలంటే వాక్యాన్ని వ్యంగ్యవిలసితం చేయాల్సిందే కదా! ఇదీ రస విద్య! ఇలాంటివి అనేక ఉదాహరణలు లభిస్తాయీ కావ్యంలో.

ఈ కవిత్వంలో అలంకారికత అలవోకగా ననలెత్తి, పుష్పించి ఫలించింది. కోకొల్లలుగా రూపకాలు మనముందు కొస్తాయి. 'పువ్వుల నవ్వులు, వెలుగుకలలు, భ్రమలగనులు, భయాలతెరలు, దేహంకలనేత చీర' వంటి పదచిత్రాలు ఆహ్లాదపరుస్తాయి.

Out sider గా నిలబడి inside ని చూడగలిగాడు పూర్ణచంద్. ఇది ప్రపంచంలోని ఉత్తమ మేధావుల సాహితీకారుల గుణవిశేషం. Voice is Worthier than speech అంటే ఏమిటో స్తిమితమైన భాషాభావాలతో ఆవిష్కరించగలిగాడు. ఉత్తమకవిగా అతని ఘనవిజయం ఇది!

అభినందనలతో, శుభాకాంక్షలతో, మిమ్మల్ని కావ్యపఠనంలోకి స్వాగతిస్తున్నాను.

\- జె.ఎస్. మూర్తి (విహారి)

*Published by :*
**Smt. Guttikonda Ramaratnam Charitable Trust**
*Machilipatnam*

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | GIVPOIDI72 | Date | 21/11/2020 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, 101 | | |
| Missing Pages | NO | | |
| Prepared | Deepika | Scanned | Swathi |
| BOOK SIZE | H 8.5 W 5.4 | Pages | 105 |